క. ఏదేవి యెట్టు లున్నన్, నీదగు వాంఛితము మాన్ప । నేనెన్న మదిం
బోదగుఁ దపమునకైనన్, గాదనక సమీపమందె । కడు నిష్ఠమెయిన్. ౯౨

చ. పరశివు నెమ్మదిన్ నిలిపి । భద్రముఁ గోరి తపంబొనర్పు వే
సరక సపర్య చేయఁదగు । జాణలఁ బంపుదు మమ్మరో నిరం
తరము త్వదీయవృద్ధిని నితాంతము గోరెదు నీదుతల్లి యే
నరయుచునుందు మేమఱక । యందొకపర్ణగృహంబు సద్విధిన్. ౯౩

చ. వ్రతమున కెంతయుం దగినభంగిని గట్టఁగఁ బంచి యెప్పుడే
వితమున నేమికోరినను । వేగమ తెచ్చి యొసంగు సేవక
ప్రతతుల నుంచి నీదగుతపంబున కెంతయుఁ దోడ్పడంగ స
మ్మతి గనుచుందునమ్మ యని । క్ష్మాధరవర్యుఁడు పల్కె నవ్వుచున్. ౯౪

చ. హిమగిరిపుత్త్రికామణియు । నిట్లనియెన్ జనకా! మదుక్తిఁ జే
ర్పుము శ్రుతిసీమలందుఁ దపముం బొనరింప నొకండెయుండ శా
స్త్రము విధియించెడుం జదువ । ఛాత్త్రయుగం బనియున్ విధించు; య
త్నము భవదిష్టమట్లు తగఁ । దద్దయుసౌఖ్యమె నాకుఁ గల్గెడున్. ౯౫

ఉ. అంతియకాని నాదుహృదయంబునఁ గల్గినవాంఛలెల్ల నా
వంతకొఱంతలేక యలరారుట కల్ల యటంచు నమ్ము మే
కాంతనివాసమే భగవదాకృతిఁ జిత్తమునందు నిల్పఁగా
నెంతయుఁ జాలియుండు సుఖమేడ? వ్రతం బననేడ? యెన్నఁగన్. ౯౬

సీ. అమరధునీపావనాంభస్తరంగముల్ చేటికాబృందమై । చేరి కొల్వఁ
దీరస్థితానేక । పారిభూరుహములు చారుసౌధంబులై । శర్మ మొసఁగ
శాఖిశాఖోల్లసత్సాంద్రపత్త్రిరుతంబులే చెలులవాదములుగాఁగఁ
బావనతమ కందఫలమూలములు రుచిరాన్న శాకాపూపకాళి గాఁగఁ

ఆ. బంచభూతములును । భాస్కరతుహినాంశుల్, తారకలు ధ్రువాదిధర్మమూర్తు
లొగిని రక్షకులుగ । నొప్పారఁ బరశివుఁ, గొలుచుదాన దివ్యఫలముఁ గోరి.

చ. నియతికి నంతరాయములు । నిచ్చలుగూర్చెడు దుష్టదైత్యసం
చయముల మత్తపోదహనజ్వాలల భస్మముచేయుదాన నా
నియమము పండుదాఁక జననీ నినుఁ జూడఁదలంప నాదుని
ర్ణయ మిది వేఱుగాఁ దలఁపరాదుసుఁడీ మిము భక్తి వేఁడెదన్. ౯౮

మ. అని ప్రార్థించుచు నుండునంత గిరికన్యాదేహభాగంబులన్
గనవయ్యెన్ నవతేజ మద్భుతముగాఁగన్ శైలరాట్టద్విధం
బును వీక్షించి విచిత్రమా నిదని యుప్పొంగెన్ గడున్ సాధ్వసం
బును గాంచెన్ మది నవ్వలన్ దలఁచె నిష్పొల్కిన్ గతాహంకృతిన్. ౯౯

చ. ఇది పరమేశుతేజమగు నీయమఁ గేవల మాత్మజాతగాఁ
గఁ దలఁపరాదు దైవగతిఁ గానఁగ శక్యముగాద దెరిక౯
మదిఁగల సంశయాళి నిఁకమానఁగవచ్చును శంకరుండె యి
మ్ముదితకు దిక్కుగాఁగలఁడు హా పలుభంగుల నేల చింతిలన్. ౧౦౦

చ. అని మది నిశ్చయించి కరుణాంబుధి శంకరుఁ డీమె నన్వహం
బును బనిపూని దుష్టమృగపూగము చేరకయుండ దుష్టులౌ
దనుజులు గాంచకుండ నియతవ్రత మించుకయేఁ గొఱంతగాం
చనియటు గాచుఁగాత మని స్వాంతమున౯ శివు భక్తి వేఁడుచున్. ౧౦౧

చ. సుత గని యిట్లు పల్కె నొకచొప్పునఁ బల్కితి నిన్నుఁగూర్చి నీ
మతివిభవంబు నేనెఱుఁగ మానిని! నిన్నుఁ బరాత్పరుండు సం
తతమును గాచు నంచు నెదధైర్యము గల్గెనుగానఁ బొమ్ము ని
న్నితరులతోడఁ బోల్పఁదగ దెన్ని తెఱంగుల నేఁ దలంచినన్. ౧౦౨

మ. నినుఁ గాపాడఁగ సేవకప్రతతుల౯ నేఁ బంప నూహించితి౯
గనుక౯ నాయవివేకముం దెలిసియే కాఁబోలు శ్రీకంఠుఁ డొ
క్కనిమేషంబున స్వీయశక్తిలవ మేఁ గాంచంగఁ జేసె౯ గదే
యనుమానం బిఁక నేల నిన్నుఁ బనుప౯ హర్షించితిం దల్లిరో! ౧౦౩

సీ. ఎనిమిదిదిక్కుల నిల నంబరంబున నుండుభూతములు నీయండఁ జేరఁ
జాలనియట్టు లాశంకరుఁడే కావఁ దలఁచినట్టులుగ నేఁ దెలిసికొంటిఁ
గావునఁ దప మొప్పఁగాఁ జేయ వేగమ తరలు మం చనుచు మూర్ధమును బుణికి
యాశిషంబు లొసంగి యనిపె నావార్తల వినినమేనాంబిక వెఱపుమాని
తే. పుత్త్రి నక్కునఁ జేరిచి పొంగిపొరలు, వగపు లోననె యడఁచికొంచుఁ గడు మేలు
గలుగునట్టులు దీవించి కదలవమ్మ, యింకఁ దపమున కని యాజ్ఞ నిచ్చె నంత.

చ. పితరులయానతిం బడసి భీతి రవంతయు నెంచనట్టి స
న్మతియె సహాయమై వెలయ మానిని సత్వశరణ్యమై భయం
కృతిఁ గనుపట్టునట్టడవి కేగె సుధాంశుధరాంఘ్రిపంకజ
ద్వితయము నంతరంగ మనుదివ్యతమాసనమందు నొప్పఁగన్. ౧౦౪

## తపోవనవర్ణనము.

మ. అలమందాకిని పావనాంబువుల రమ్యస్ఫారతీరస్థలం
బుల నార్ద్రింబులుగా నొనర్చి ప్రమదంబు౯ గల్గఁగాఁ జేయుచు౯
విలసత్తుంగతరంగహస్తముల వేవే భక్తులం జేరరాఁ
బిలువ౯ స్వర్గసుఖంబుఁ గూర్చునటు భావింపంగ నర్హంబునై. ౧౦౫

సీ. భవరాగభేషజప్రాయ శీకరముల వెదఁజల్లుచు౯ గడు వింతగాఁగఁ
బయిపయిం బ్రోలసెడు బాలవాయువులచే నెల్లరయాధులఁ బెల్లగింపఁ

బూనినయట్లుగాఁ ఽ బొల్చుచు సంచలజ్జలనిస్వనంబుల ఽ సకలజనుల
స్నానపానంబుల ఽ సకలపాపంబులు దొలఁగు రం డనుచును ఽ బిలుచునట్లు
తే. లొప్పుచుఁ బతిఁగాంచెడు ఽ నుత్సుకతను, బరుగువాతెఱురీతి జీవంబు దుస్స
హముగఁగన్పడనరుగుచుఁ బ్రమదలకౌఁగి, సాధువర్తనమును దెల్పుచందమమర.

చ. నిలుకడలేనివృత్తిఁగొని ఽ నిక్కుచు స్వేచ్ఛఁ జరించునట్టి మ
ర్త్యుల కిటు పూర్వకర్మభవయోగఫలంబులుగూడ నొప్పకే
కలిగినయట్లు చూడఁదగి ఽ క్రన్ననఁ బోవు నటంచుఁ జక్కఁగాఁ
దెలిపెడునట్లు వస్తువితతిం గొని వే చనుచుం గనంగనై. ౧౦౮

ఉ. అంబరవీథి నొక్కమొగి ఽ నార్ద్రముగా నొనరింపఁబూని పం
తంబున నట్టిలేచి యది ఽ దార్కొనరామికిఁ జింతమున్ని వ్యో
మంబుననుండి మున్ దిగినమాడ్కిని వ్రాలఁగ నిక్కువాఁడు వే
గంబునఁ గ్రిందికిం దొరఁగుఁగా యని తెల్పెడునంచుఁ జూడనై. ౧౦౯

చ. తరుతతిపల్లవంబుల సదాగతిసంగతి సంగతాంబుశీ
కరముల వింతభూషలను ఽ గ్రాలెడునట్లు లొనర్చుచున్ మనో
హరగురు వీచికానిచయ ఽ హస్తములన్ ధరణీతలంబు స
త్వరముగ నావరింపఁ బ్రమోదంబునఁ బూనినయట్లు లెన్ననై. ౧౧౦

ఉ. తుంగతరంగమాలికలఁ ఽ ద్రోయుచు లాగుచుఁ దీరభూములం
దుం గనుపట్టువస్తువులఁ ఽ దోరపువేడుకఁ బొంగుచున్ మన
స్సంగతవాంఛ లిట్టులె వెసం బొడచూపు నడంగు నన్న నీ
తిం గనుఁడంచుఁ దెల్పెడువిధిన్ నటియించుచు మెచ్చ నర్హమై. ౧౧౧

శా. మింటం బాఱు విహంగమావళులు ప్రేమింపన్ గతిన్ మాని వె
న్వెంటన్ నిస్వనముల్ ఘనర్ప బహుళోర్వీజప్రకాండాళి వా
ల్గంటుల్ దంటలనొప్ప వ్రాలి కనఁగాఁ ఽ గమ్రోర్మికారావముల్
వెంటన్వెంటఁ జెలంగ సుందరలసద్వృత్తిన్ నుతింపంగనై. ౧౧౨

చ. జలపతగస్వనంబులె యొసంగెడుపల్కులుగాఁగ నున్నతో
ర్ములె మృదుబాహువల్లరులపోలిక నొప్పఁగ నర్తకీవిధం
బలరఁగ లోకతత్త్వము నహర్నిశముం క్షణభంగురంబుగాఁ
దెలుపుచు సాటిలే కలరు దేవనదీతిలకం బ దెంతయున్. ౧౧౩

చ. కనులకు విందుఁగూర్పఁ శితికంఠునిఁగూర్చి తపం బొనర్చువే
డ్కసుమ వనంబుతీరమునఁ ఽ గమ్రతరద్రుఫలప్రసూనరా
జిని దళుకొత్తఁగా నట వసించి మహానియమంబుమీఱఁగా
నొనరిచె శంకరుం డెదుటనున్నటు లెంచుచు నిశ్చలాత్మయై. ౧౧౪

సీ. నాసికాగ్రపదంబునన్ దృష్టిఁ గదియించి పద్మాసనస్థితిఁ । బరిఢవిల్లి
వక్షంబు తనుమధ్యభాగమ్ముకన్న రవంత నగ్రస్థల । మాక్రమింప
మధ్యభాగమ్ము సమమ్ముగా నమరియుండఁగ యష్టివలె దేహము గడు విచల
మై యొప్ప మనసు మహాదేవుపాదపద్మములందు నిశ్చలతన్ నిలువఁగ
తే. నుత్తమాంగముఁ జుట్టిమహోత్తమ మగు, దివ్యతేజంబు వెలయ నతిస్థిరమగు
శ్రద్ధమై యోగశాస్త్రికపద్ధతిని దప మ్మొనర్చె మునుల్ మెచ్చఁ । బర్వతసుత.

చ. తనదగుదివ్యతేజ మొగిఁ । దామరసాప్తునిమండలంబు మిం
చి నిగిడి దేవసిద్ధులను । జేడ్పడఁజేయఁగ యోగతత్త్వ మీ
వనిత యొనర్చుసత్తపము । వైఖరియే యని నిశ్చయింపనో
ననుచు సనందనాదిమును । లద్భుతమందఁగఁ బొల్చె దేవి తాన్. ౧౧౬

సీ. గంగాతరంగిణీసంగతిని జెలంగు చంద్రరేఖోల్లసజ్జటలరాజి
క్ష్వేళానలజ్వాలమాలాభయంకర వక్త్రగహ్వరయుత । వ్యాళచయము
సర్వసమత్త్వైకసరణిని బోధించు కరుణారసార్ద్రదృక్కమ్రవదన
మాశ్రితాపద్గణాహరణశీలకలాపసంఫుల్లపదసారసద్వయంబు
తే. తనదు విమలాంతరంగంబున నచపలత
నెలకొనియె యుండఁ గాంచుచు । నియతిమీఱ
నద్వయుని యోగిహృద్ధ్యేయు । హరుని నమ్మి
తపము సల్పెను మును లద్భుతంపడంగ. ౧౧౭

చ. అవయవముల్ నిరంతరహిమాంబుకణంబుల తాఁకునన్ మహా
పవన సమీరితాంబుధరపంక్తివితీర్ణమహాంబుధార లొ
క్కవడువునం గలంచుటను । గాసిని బొందఁగ సుంతయే మనం
బు విచలతం గనంజననిపోలిక నొప్పఁ దదేకనిష్ఠమై. ౧౧౮

మ. శితికంఠున్ బరమేశు నవ్యయు నజున్ । జిత్తేశుఁగా నెంచుచున్
గతి వేఱొద్దియు లేదటన్న తలఁపుల్ । క్రమ్మంగ సంతృప్తి దే
వతలున్ మెచ్చఁ దపంబొనర్చె జలముల్ । వాతంబు ప్రాచీనప
త్రతతుల్ భుక్తిగ స్వార్థ మెడ్డ ఫలమంతం బౌనో యం చెన్నుచున్. ౧౧౯
చ. తరుణిమనంబునుండి యొకతంతు వదృశ్యగతుల్ చెలంగ శం
కరు మదిదాఁక సాగె నదె । కాంక్ష యనంజను దానిరూప మె
వ్వరు కనఁజాల రవ్వియె యభంగురశక్తిని లెక్కసేయఁగా
దరమెటులైనఁ గానియటు । తార్కొనియుండు జగద్విజంబునన్. ౧౨౦
శా. ఆతంతువ్రజమే పరస్పరము హార్దాంభోనిధిన్ ముంపఁ జిం
తాతాత్పర్యముఁగూర్పఁ బ్రాణులకు నూర్ధ్వస్థానముఖ్యంబులన్

బ్రీతిన్ వర్తిలు దేవతాదులకు నేరీతిన్ సుసంబంధమౌఁ
జేతఃకాంక్షలెటుల్ ఫలించు నటులే ॰ చేయున్ స్థితుల్ సాగఁగాన్. ౧౨౧

ఉ. దాననె లోకజాలము సతంబు దృఢోత్తమరశ్మిబద్ధమై
తా నొకరీతినే వెలయుఁ ॰ దత్త్వవిదుల్ కనుచుందు రీగతిన్
మానసరశ్మిబంధము లమానుషముల్ మఱి కర్మరూపముల్
కానఁగరాకయే యవి నికామముఁ బొల్చెడు నంచు నాత్మలన్. ౧౨౨

ఉ. లోకములందుఁ గల్గుజనులున్ మఱియుం గలప్రాణికోటులున్
బాకరిపుండు లోనయిన ॰ పాలకులున్ దదుదారతంతుసం
ఘాకలితాంతరంగులయి ॰ యన్వహమున్ జరియింతు రద్దియే
లేక చెలంగు నెంతయును ॰ లీలలఁ దత్త్వ మ దద్వయం బగున్. ౧౨౩

చ. అదియొకఁడే స్వతంత్రత నహార్యగతుల్ దగియుండఁ జాలు నిం
కెదియు నటుండఁ జాలదని ॰ యెన్నఁగనౌ మతిమద్గణంబుచే
నిదియెకదా యథార్థమని ॰ యించుకయేఁ దెలియంగలేక కుం
దుదు రిల బాలిశుల్ నిజము ॰ తోఁచుట శాంతి వహింత్రు సజ్జనుల్. ౧౨౪

ఉ. ఆగిరిరాజపుత్త్రి దగు ॰ నాత్మఁ గలట్టితలంపె తంతువై
సాగి య దెవ్వరేఁ గనఁగఁ ॰ జాలనియట్లు మహేశుదివ్యహృ
ద్భాగముఁజేరి నిల్చె; భగవంతుఁడు శంకరుఁ డార్తరక్షణం
బే గద కృత్యమంచు మది ॰ నెంచెను దత్సుకృతంబు పెంపునన్. ౧౨౫

మ. భగవంతున్ బరమేశు స్వాభిముఖుగా ॰ భవ్యాకృతిం దాల్చువా
నిగఁ జేయందగు నద్ది యారయ ననింద్యంబైన కర్మంబె దా
నిగతుల్ పెక్కులు వానిఁదత్త్వవిదులే ॰ నేరర్గదా కన్గొనన్
బొగడొందున్ జగమందు దైవ మనఁగాఁ ॰ బూజ్యం బనంగా నదే. ౧౨౬

క. దానిగతుల్ గహనము లని, పూని వచించెడిని శాస్త్రపుంజం బదియే
మానవులను సుఖదుఃఖము, లూనంగాఁ జేయు వారిలొప్పక యున్నన్. ౧౨౭

చ. కనుకనె కర్మమార్గ మధికంబగు నన్నిఁటిలోన నంచు స
జ్జను లెపుడుం దలంతు రదె ॰ శర్మదమౌ విధియుక్తి నాచరిం
చిన నటుగాకయున్న నది ॰ చేకురఁజేయును దుఃఖమిద్ది త
ప్పనినుడి యంచు నమ్ముదురు ॰ భద్రముఁ గోరిన యట్టిమానవుల్. ౧౨౮

శా. ప్రాలేయాచలకన్యకామణి మదిన్ ॰ భావించె నెద్దాని వా
గ్జాలంబెల్లఁ బవిత్రతం గనఁగ శాస్త్రప్రక్రియం బల్కఁగాఁ
జాలెం దేని సువాంఛితం బదియె యీశానున్ మహాదేవు సు
శ్లోకుం జేరి వరప్రదాననిరతిం ॰ జొప్పించెఁ దద్ధృత్త్యలిన్. ౧౨౯

మ. విరతిం గాంచని నిష్ఠ బాలికయు హృద్వీథిన్ స్వకీయాంఘ్రిపం
కరుహద్వంద్వము నిల్పి శాస్త్రహితసంకల్పంబునన్ ధ్యానయో
గరతుల్ మించఁగఁ దన్ భజింప హరుఁ డక్కాంతామణీ వాంఛ నా
దరణం బొప్పఁగఁ దీర్పనెంచె సుకృతార్థంబుల్ ఫలించుం గదా. ౧౩౦

శివుఁడు పార్వతినియతిఁ బరీక్షించుట.

మ. తను దర్శించెడుభాగ్య మబ్బుట నితాంతస్ఫారపుణ్యోదయం
బుననే కావున శంకరుండు మదినిం బూనెం బరీక్షింప; శం
భునియూహల్ బొడసూపినంతనె మహాభూతంబులం దాద్యమౌ
వినుతిం గాంచెడు నంబరంబు జలముగ్బృందంబుఁ బుట్టించినన్. ౧౩౧

చ. మరుదధినాయకుండు తనమందగతుల్ కనరాకయుండ నే
వరుస భరింపరానివిధిఁ బర్విడఁబూనె వియత్తరంగిణీ
గురుతరవారిపూరములు కొంకక వాయుసమీరితంబులై
పరుగిడి విశ్వమెల్ల నొకపట్టున లోఁ గొననెంచె నెంతయున్. ౧౩౨

చ. జలములు పొంగుచుండఁగ నిజంబగు యత్నము సాగ దన్న యు
మ్మలిక ధనంజయుండు నభిమానము వీడినయట్లు కృత్యముం
దలఁచుచునుండె క్ష్మాసతి స్వధర్మముమాని మహేశునిచ్ఛచేఁ
గలఁగి వికంపతంగనెడు కాంక్షను బూనె నిరంతరంబుగన్. ౧౩౩

క. పంచమహాభూతము లిట్టు,సంచలతం గాంచి యప్డు సర్వేశ్వరున
ర్చించెడుగతి వెలసిన నొ,క్కించుకయును శాంతిలేకయే యపు డుండెన్. ౧౩౪

క. ధారాధరములు నిర్ఘో,షారంభముగాఁ గరీంద్రహస్తాకృతి నా
సారమున ముంచె విశ్వం,బారీతిం జెలఁగి వీచె ననిలుఁడు పూన్కిన్. ౧౩౫

చ. ఉడుగక వీచువాయువుల నొక్కమొగిం బడువర్షధారలం
గడఁగి సహించి పార్వతియు గాఢతరం బగుశ్రద్ధ నీశు న
య్యుడుపతిశేఖరున్ గొలుచుచుండె నదేవిధి నంతరాయముల్
తడయక కల్గుచుండినను ధైర్యమె సిద్ధిద మన్ననమ్మికన్. ౧౩౬

సీ. ఉత్తమాంగంబున యూధనాధకరోప మాంబుధారలు పడి యందు నిలువ
కల్లన ఫాలమ్ము నుల్లసిల్లం జేయుచును జవంబున నేత్రవనజములను
దడుపుచు దిగజాఱి తద్దయు ముగ్ధంబు లగుగండఫలకంబులందుఁ బాఱి
క్రిందికి దిగి యందుఁ గించిచ్ఛ్రమంబున కలవడి వక్షోరుహముల నెట్లొ
తే. పాఁకి వడివడి దిగి నాభిపల్వలమును, జేరి యందుండి వెడలుట యేరికైనఁ
దెలియరా నట్టులుండె; నాతెఱవమిన్న, యట్టివృష్టికిఁ జలియింప కార్తిగనక.

క. తననియమము సాగఁగ నుం,డెను గాఢసమాధి యచలవోడిన శిలపోల్కిన్
గనఁబడుచుండె మహాభూ,తనికర మానియతిఁ గాంచి తమపని మానెన్.

చ. కదలికమానె దేహము నికామము స్థైర్యము నూనె చిత్త మిం
తదనుక నాసికాగ్రమునె తప్పక చూచుచు నున్నదృగ్ద్వయం
బొదవినకాంతి సూక్ష్మముగ నొప్పి సుషుమ్న యనంగ యోగిసం
విదితమునైన సత్పథము వేడుక నొందెను దేని గాంచనో. ౧౩౯

చ. శిలవలెనున్న యాసుదతిచెంతనె చేరక పోవుచుండు ప
శులగుమి యిద్ది యేదొ యొకకుంజ మటంచుఁ దలంచి చాలవే
డ్కలఁ బయి ప్రాలుచుం జనుచుఁ గమ్రరుతంబుల శ్రోత్రమండలం
బుల నలరంగఁజేయుచును బోవుచు వచ్చుచునుండు నిచ్చలున్. ౧౪౦

ఉ. చీమలు లోనుగాఁగలుగు చిన్నకృముల్ తరు వన్నభ్రాంతిఁ బై
కేమెయినైన జంతు గన కెంతయుఁబూనికఁ బ్రాఁకుచున్ మహో
ద్దామజవంబునన్ దిగుచు ధన్యము యత్నమటంచు నెంచు నా
కోమలి సుంత చాపలముఁ గూడని గాఢసమాధి నుండుటన్. ౧౪౧

మ. ఒడిలోఁజేరి సరీసృపంబు లది యేదో పుట్టయం చెంచి యి
క్కడ బాగుండును గాపురం బనెడు వేడ్కన్ గాంచి మాత్సర్యమున్
విడువంజాలి వసించెఁ బూర్వసుకృతావేశంబునన్ సుంత యా
బిడ నేమంబును వీడకే కొలిచె శ్రీవిశ్వేశు నెల్లప్పుడున్. ౧౪౨

చ. అదియె సమాధి యంచు మును లందురు చిత్త ముపాస్యదేవతా
పదసరసీరుహద్వయముఁ బాయక చూచుచు నింద్రియాళి యొ
ప్పిదముగ వశ్యమై నయము పెంపును గాంచఁగఁ జేయు చున్నసి
ద్ధిదము సమాధి దానిగుఱుతించియొ బాలిక పూనె శ్రద్ధచేన్. ౧౪౩

ఉ. అట్టిసమాధియందుఁ దన యాత్మఁ దిరంబుగ నిల్పి సుంతయేఁ
బట్టుతొలంగ కీశ్వరుని పావనరూపము లోఁ దలంచుచున్
బుట్టువుఁ దొట్టి చేపడిన పూజ్యతరం బగుశ్రద్ధ మించి తోఁ
బుట్టువురీతి సాయపడ భూరితపం బొనరించె నవ్వనిన్. ౧౪౪

చ. తపమది నూలుకొల్పెఁ బరతత్త్వము తానయి భక్తు లెట్టిదా
వపువును నామముం గలుగ భావనచేయుచు హృత్సరోజమ
ధ్యపదమునందు నిల్పి కొనియాడఁగఁ గోర్కు లొసంగుచున్ హరుం
డుపనిషదోఘవేద్యుఁ డన నొప్పు సదాశివు లోకరక్షకున్. ౧౪౫

చ. తను మది నిల్పి యొంటిరిగ దారుణసత్త్వనిరంతరాటవిన్
ఘననియమంబునం దప మఖండతమం బనఁజాలునట్టి దా
నిని విధిఁజేయునద్రిజకు నెమ్మినిఁగూర్చు వరంబు లీయనెం
చెను బరమేశ్వరుండు ఫలసిద్ధిని గాంచునుగా తపం బిలన్. ౧౪౬

### కుహనాశివుఁడు పార్వతికడకు వచ్చుట.

ఉ. ఇంకొకసారి పార్వతియభీష్టములం బరికించి తీర్పఁగా
శంకరుఁ డాత్మ నెంచి కడసారి పరీక్ష యిదౌ నటంచు నే
కాంకములోనుగాఁ గలుగునయ్యయిచిహ్నములం ద్యజించి యే
శంకకులోనుగాక తగు । చారుశరీరముఁ దాల్చె నాదృతిన్. ౧౪౭

సీ. సరసిజంబుల సొంపునిరసింపఁగాఁ జాలు కనుదోయి ముచ్చటల్ । గలుగఁజేయ
స్మరచాపమును గేలిసల్పుచుమించెడు భ్రూయుగం బొకవింత । పుట్టఁజేయ
లలితకటాక్షైకఫల మిదె శ్రీయుగ మనురీతి శ్రుతియుగ్మ । మమరియుండఁ
గరుణాస్పదం బిదె । గదయని నుతిఁగాంచు కమనీయవక్షంబు । కళల నీన
ఆ. వాంఛ లొసఁగఁజాలు । వర్ణముల్ వెడలింపఁ
గాంచియున్న వన్నెడు । కరణి నెసఁగు
నోష్ఠయుగళ మెంతొ । యొప్పులకుప్పఁగా
నమరియుండ రూప । మది చెలంగె. ౧౪౮

మ. పదునాల్గేఁడులు దాఁటి యిర్వదికి లోపంబై తదీయాంతరం
బిది యింతే యనితెల్పఁగా మఱియు నూహింపంగ శక్యంబురా
నిదిగాఁ బ్రాయము చెల్వుమీఱి మదనుఁ । నిందింపఁగాఁజూచు న
ట్టిదియై కన్పడ రూప మప్రతిమమై । యేపారె బల్వింతగన్. ౧౪౯

చ. అరుదగు ఫాలనేత్ర మపు । డారయ యోగులకేఁ గనంగనౌ
సురలకుఁ గానరాక తగుఁ । జోద్య మిదేకద తా స్వతంత్రుఁడౌ
పరశివుఁ డెద్దిచేయఁ దలఁపఁ ఫలియించు న దప్పు డంచు ని
ర్జరవరులే యెఱుంగుదురు । జ్ఞానధనంబున నొప్పియుండుటన్. ౧౫౦

సీ. రుద్రాక్షమాలికల్ । రుచిరమణీహారములుగ భోగీశవిభూషణములు
మాణిక్యభూషణమండలంబుగ నర్ధచంద్రకలాపంబు । చారువజ్ర
కల్పితమకుటసంఘటిత చిహ్నంబుగ గంగాతరంగిణీతుంగభంగ
మాలికల్ మణిరుచిజాలంబుగా భస్మచర్చ శ్రీచందనచర్చగాఁగ
తే. నితరులకుఁ గన్పడంగ నా । యిందుధరుఁడు
రుచిరతరమూర్తియై యొక్కరుండె చేరె
ఘోరతప మాచరించు నా । కోమలాంగి
యున్న వనమున కమరు లోహహో యనంగ. ౧౫౧

మ. తనకంటెన్ మును మందమారుతము మోదంబొప్ప నక్కానసం
బున వ్యాపించుచు దర్శనం బొసఁగుమా । భూతేశ్వరా! యంచుఁ బ్రా
ర్థనముల్ చేయఁగఁ గానసామరులు వింతల్గూర్చు వన్నెల్ తగన్
వనముం దెల్లెడలన్ మయూరములు నిస్స్వానంబులన్ నింపఁగన్. ౧౫౨

చ. చిలుకలు ముద్దుగుల్కు నటు చేరి పరస్పరహారిభాషణం
బులఁ దరురాజియే పలుకుఁబోల్కిని దోఁపఁగఁ జేయుచుండ ని
స్తులగతులన్ మయూరవితతుల్ తిరుగాడుచు సుందరారవం
బుల వనమెల్ల మార్పలుకఁ బూనినరీతి నొనర్చుచుండఁగన్. ౧౫౩

చ. వలువ లమూల్యముల్ తనదువర్ష్మమునన్ వెలయంగ రత్నకుం
డలములు కాంతు లీనుచుఁ గనంగన వింతగఁ దోఁచుచుండ ని
మ్ములఁ గపురంపుఁదమ్ములము భూరిపరిమళసంతతిన్ దిశా
జలరుహనేత్రలం బరవశత్వము నొందఁగఁ జేయుచుండఁగన్. ౧౫౪

మ. స్మితమాస్యాంగణమందుఁ దాండవ మొగిం జేయం గటాక్షంబు లా
యతకారుణ్యరసాలవాలములె యౌనౌ నంచుఁ దెల్పంగ నా
క్షితిభృచ్చాపుఁడు మందమందగతులం జేరెం దదావాస మ
య్యతివం బూన్కిఁ బరీక్ష చేయఁదగునూహన్ జిత్రవేషంబునన్. ౧౫౫

మ. పరమేశుం డిదె వచ్చె నీదుతపముల్ పండెన్ మహాభాగ్యముల్
పరుసన్ నీకు లభించుఁజుమ్ము గిరిజా వర్ణింప శక్యంబె యె
వ్వరికే నీదగుపుణ్యమంచుఁ దమిచేఁ బక్షుల్ శుకాదుల్ మనో
హరవాక్కుల్ వెలయించుచుండుతఱి దుష్టారాతి యీశానుఁడున్. ౧౫౬

చ. పదకమలంబులన్ ధరణిభాగముఁ బూతముగా నొనర్చుచున్
సుదతి వసించునాశ్రమముఁ జొచ్చెను పార్వతి యప్పుడే సమా
ధి దలఁగి లేచుచుండి వసతిం గనవచ్చెడు నూత్నపూరుషున్
మదనుని ధిక్కరింపఁదగు మంజులరూపుని గాంచె వింతగన్. ౧౫౭

చ. తొలుత జనించె సంభ్రమము తోడనె లజ్జయు నంకురించె న
వ్వలఁ బ్రమదంబు నూల్కొనియె వైళమ సాధ్వస మొక్కయింత యె
ట్టులొ తలచూపఁగల్గెను గడుంగడు వింతగ నవ్వియెల్ల న
వ్వెలఁది మనంబునన్ నిలువ వేడుకఁ బూనుచు నుండె నెంతయున్. ౧౫౮

శివపార్వతీ సంవాదము.

చ. అతిథి గృహంబుచేరఁగ యథార్హముగా భజియింపనొప్పు నం
చతివ యెఱింగియుండియు మహాత్ముని నాతని జూచినంత నే
వితమునఁ బూజలం దనుప వేదవిధుల్ ముద మొందునట్టి ప
ద్ధతులను నొక్కఁడే మదిని దాఁకమి నూరక నిల్చియుండెఁ దాన్. ౧౫౯

ఉ. ఇంచుకసేపు నిశ్చలత నే గనియుండి మహాభ్రమంబు మా
న్పించెడు జ్ఞానచండకరునిం గనఁజాలిన ప్రోడగాన వ్యా
పించినమౌగ్ధ్యమున్ వదలి పెంపెసలారెడు భక్తి నూని సే
వించెను శాస్త్రపద్ధతిని విశ్వవిభుం బరమేశు శంకరున్. ౧౬౦

మ. వనితాధర్మము సుంతయున్ సడలకే వర్ణింప నర్హంబుగాఁ
గనుపట్టన్ దలవాంచి తచ్చరణయుగ్మంబుం గటాక్షంబులం
గనుచున్ మెల్లఁగ నార్యవర్య! యొచటుం గానంగఁ బోఁగోరి యీ
వని కేతెంచితి రావిధంబు వినఁగా వాంఛింతు నిప్పట్టునన్. ౧౬౧

చ. ఉచితమయేని నే వినఁగ నొప్పునయేని శ్రమంబు దాన మీ
కిచటఁ బొసంగదేని వచియింపు మహాత్మ! మదీయపూర్వపు
ణ్యచరితముల్ ఫలించు నని యాత్మఁ బ్రమోదము నొందుదాన నం
చచలకుమారి వేఁడుటయు నాకుహనా మునిసూనుఁ డిట్లనున్. ౧౬౨

శా. ఎందుంబోవఁ దలంపుగల్గు మది నడ్డే చేరియేయుండు మే
మెందేనుండిన నెల్లెడన్ నిలిచినట్లే చూడనై యుండు మా
నందాంభోనిధి నోలలాడుచును వింతల్ చూచు దుర్భ్రాంతిలే
కెందుం జూచినఁ గానవచ్చు మునిబృందేష్టంబులం దీర్చుచున్. ౧౬౩

ఉ. తోఁచినయట్లు చేయఁదగు తోరపుశక్తి చెలంగ నార్తులం
గాచుటయే వ్రతంబుగ జగంబుల ధర్మముఁ బాడుచేయఁగాఁ
జూచెడువారిఁ ద్రుంచుటయె శూరవిలాసముగా నెసంగు మా
కో చపలాక్షి! యిప్పు డిట కొప్పుగ వచ్చితి మీ నిసుం గనన్. ౧౬౪

ఉ. నిన్ను గుఱించి యిందలిమునిప్రవరుల్ వచియింప వింటి మో
కన్నియమిన్న! యీనియతిఁ గాంచిన నించుకచోద్యమయ్యె నే
కన్నెలు మున్ను పూనినటు కానఁగరాదు జడాత్ము లెవ్వరో
ని న్నిటు ప్రోత్సహించి రని నేఁ దలపోయుదు నెంతొ వింతగన్. ౧౬౫

చ. అరయఁగఁ గ్రూరబుద్ధులగు నట్టిశఠుల్ కఠినంపుఁ గార్యముల్
పరులకు నచ్చఁజెప్పి సులభంబులుగా మది నమ్మఁజేసి వా
రురుతరకష్టముల్ గుడువ నొయ్యనఁ జూచుచు సంతసించుచుం
దు రిది విలాసమై తనరుఁ దోయరుహానన! యట్టివారికిన్. ౧౬౬

ఉ. ఐనను బ్రశ్న చేయుదు నొయారము హెచ్చుగఁ జూపనొప్పు నీ
మేను నిరంతరం బిటులు మించినపూన్కి శ్రమంబునొందు న
ట్లోనలినాక్షి! చేయు టిదియొప్పునె యెవ్వనిఁగూర్చి యిట్టు లీ
కాననమందు నిష్ఠ గనఁగాఁ బనిఁ బూనితి వింత తెల్పుమా. ౧౬౭

చ. ఫలమది యెట్టిదో యొసఁగఁ బాల్పడువాఁ డతఁ డెట్టివాఁడొ తొ
య్యలి వచియింపుమా వినఁగ నాత్మయు సంభ్రమమొందుచున్న ద
ద్దలవియొ పొందఁ గాదొ నిజమారయువాఁడ రహస్యమైనచోఁ
దెలుపుమటంచు నే నడుగఁ దెప్పున నేగెదఁ గార్యసంగతిన్, ౧౬౮

ఉ. వేఱుగ నన్ దలంపకు సువృత్తవుగా మదిఁ దోఁపవచ్చితిన్
మీఱెడుకాంతిచే ననిన మేచకకంధరుపల్కు లెన్ని బల్
నేఱుపుకాఁ డితండగు వినీతునిపల్కులె యివ్వి; యెట్లుగా
మాఱు వచింపనౌనో యని మానసమందుఁ దలంచి యంతటన్ ౧౬౯

చ. పరశివు సంస్మరించి మృదుభాషలఁ బల్కె గళస్వనంబు వీ
ణరవముమించ నో ప్రమథనాయకరూప! మహాత్మ! యేశతో
త్కరమునను దపంబునకుఁ గాఁ బురికొల్పఁగలేదు నేనె శం
కరుని దయాకరుం గుఱిచి గాఢతపం బొనరింప వచ్చితిన్. ౧౭౦

చ. జనకులు కూడదంచుఁ బలుసారులు పల్కుటెగాక పెండ్లిచే
యను దలపోసి నీకు హరి యర్హుఁడు గాఁదగు నంచుఁబల్కె రే
ననయము శంకరుం బతిగ నాత్మఁ దలంచెడుదానఁ గాన నా
తని వరియింపఁ గోరక స్వతంత్రత వచ్చితి నిష్ఠఁ బూనఁగన్. ౧౭౧

మ. తొలిమేనం బొనరించియున్నసుకృతుల్ తోడ్తోడఁ బ్రోత్సాహమున్
గలుగంజేసెను గాన వచ్చితిని నాకాంక్షల్ ఫలింపంగ భో
గిలసద్ధారుని యోగిసంస్తుతుని సత్కీర్తిప్రభాజాలసం
వళితాశాంతుని భక్తరక్షకుని సేవం దన్పు నిష్టంబునన్. ౧౭౨

చ. అనుపలుకుల్ చెవిం జొరఁగ నట్టె యహా యనిపల్కి నవ్వి త
న్విని బరికింపఁగా నిదియె వేళ యటం చెద నిశ్చయించి యి
ట్లనియెను బాలవాదువుకదా నగుఁబొట్లగుఁగాదె నీవాన
ర్చినజతనంబు సత్ఫలదు శ్రీపతినిన్ విడనాడి వెఱ్ఱివై. ౧౭౩

ఉ. ఇల్లనలేక బంధు వితఁ డివ్విధి నాకనిచెప్ప నొక్కఁడేఁ
దెల్లముగాఁ గనంబడక దీనులెకాని పొగడ్తగన్న భా
గ్యోల్లసితుం డొకండయిన నొక్కపుడైన సఖుండు లేకయే
యెల్లెడ సంచరించు నురగేంద్రవిభూషణుఁ గోరి తక్కటా! ౧౭౪

సీ. అభిజనసంపద కాశించితో మహాభాగ్యంబు వీక్షించి భ్రాంతిగనితొ
సౌందర్యమును గాంచి సంతసంబందితో మణిహారములఁ గని మమతగనితొ
సౌధమ్ములకు మహైశ్వర్యంబు నొందితో బంధులఁ బరికించి వాంఛగనితొ
రతనంపురాసుల కతిమోదమందితో సరసత కామోదనిరతిఁ గొనితొ

తే. పరిజనంబుల నారసి బాగటంచుఁ, బొంగితో యెడఁబాయనిమునుల నెంచి
చాల నుప్పొంగితో నీవు చేల వలచి, తెవ్విధినో భూతగణవృతు నీశుఁ జెపుమ.

ఉ. కట్టను బట్టలేక తినఁగాఁ దగునన్నములేక హస్తిదా
దట్టపుఁజర్మముం దొడిగి దారుణకాననవస్తురాజియే

పుట్టువుఁబొట్టి భోజ్యముగ భూరిభయంకరభూతసంఘ మె
ప్పట్టున వీడనట్టి పరివారముగా వనమే గృహంబుగన్. ౧౭౮

ఆ. గోచిపాత లేని క్షోణీసురర్షులే, యాశ్రితులుగ నుండునట్టి శివుని
వలచి తతని కుండుభాగ్యంబు దేనిని, గాంచి చెపుమ మదిని గలవిధంబు.

సీ. సోయగంబు ధనంబు ప్రాయంబు కులమును బంధురాజియుఁ బరివారవితతి
ప్రాసాదములు విహారమున కర్హంబులౌ నిష్కుటంబులుమఱి నిర్మలాంబు
పూర్ణసరస్సులు భూరిరాజ్యంబును గప్పంబులొసఁగు క్ష్మాకాంతు లెపుడు
కైవారములు సేయఁగాఁదగు నమసులు దనపైనఁ దఱుగనితమియుఁ గల్గి

ఆ. యుండుహృదయనాథు నువిదలు కోరుట,ధర్మ మిాజగానఁ దగినయట్టి
వందఱొప్పఁ దగినయాచార మిాయది, బాల! దాని మాన మేలు గాదు.

ఉ. చిన్నఁదనంబు దానిఁగని చెల్మివహించెడుమాధ్య మిాద్వయం
బు న్నెఱి వృద్ధిచేయుటకుఁ బూనిన యజ్ఞులబోధనంబు ని
ట్లన్నియు నీకుఁ బెట్టనిమహామణి భూషణరాజినైై తగెఁ
గన్నెరొ నీదుభాగ్యము నిఁకన్ నుతిచేయఁగ శక్య మెట్లగున్. ౧౭౯

ఉ. ఈశ్వరుఁ డిచ్చె నీ కిపు డదృష్ట మనం దగియుండు సోయగం
బీశ్వరియే యనందగుదు వెన్నఁగ నీవిషయంబునందుఁ జూ
నశ్వర మిద్దియంచును మనంబున నెంచిన వారుచెప్ప లో
కేశ్వరు విష్ణునిన్ వదలి యిట్లు వనిన్ వసియించితో చెలీ. ౧౮౦

ఉ. ఈవిషయంబునందు నిను నెంచఁగ మించెడునజ్ఞు లుండ రే
యేవిషయంబులం గనిన నిద్ది నిజ మ్మని నమ్ము మంబుజా
క్షీ! విను మొక్క మంచినుడిఁ జెప్పెద నీదగు మేలుకోరియే
పోవిడు మీావ్రతం బిపుడె పొమ్ము గృహంబున కెంతొ వేడుకన్. ౧౮౧

చ. జనకులు సంతసింప గురుసత్తము లాదృతి నిన్నుఁగాంచి దీ
వనముల వేడ్కఁబెంపఁ బరివారము లార్తిఁ ద్యజింప నెచ్చెలుల్
మనములఁ గూర్మినింపఁ గులమండనమై తగుబంధుజాల మె
ల్లను వినుతింప నుండుము విలాసమునన్ హరి నాథుఁ గోరుచున్. ౧౮౨

చ. విచికిలగంధి! నీవు కనువిందుగ శ్రీహరిపత్నివైన మా
నిచయము సంతసించు జననీజనకుల్ పరిపూర్ణకాంతులై
ప్రచురధనంబు లబ్బినటు ప్రాజ్యతమాయతరాజ్య మబ్బి న
ట్లెచటఁ గొఱంతలేనియటు లెంచి సుఖింతురు స్వేచ్ఛమిాఱఁగన్. ౧౮౩

ఉ. ఇందఱుసంతసింపఁ జగ మెల్లను మోదము నొందు నట్లుగా
నం దరళాక్షి! యాతపము నం దగుప్రీతిని మాని పొమ్ము స్త్రీ

8

లందఱు నాథునిం గలిసి ౹ యర్హవిధంబున దేవతార్చనం
బుం దమిఁ జేయఁగావలయుఁ ౹ బోలదె శాస్త్రమురీతివర్తిలన్. ౧౮౪

మ పతిఁ జేపట్టకయుండు కన్యలు తపఃప్రారంభముం జేయఁగా
హిత మంచున్ వచియించు శాస్త్రములు లే ౹ వెందున్ సరోజాక్షి! నా
హితవాక్యంబుల నాలకించి తగన ౹ ట్లీవిప్డు సాగించుగా
ఘతపశ్చర్యను మాని శ్రీపతినిగూఢం గోర్కెమై నుండుమా. ౧౮౫

చ. తను విడి నశ్వరంబె యగుఁ ౹ దామరసాక్షి! యొసంగుజవ్వనం
బనునది బుద్బుదాభ మని ౹ యారయు మవ్వలఁ గోర నించుకై
నను మఱి రాదుసుమ్ము జతనంబునఁ గల్గినదానిఁ దృప్తిఁగా
ననుభవమందుఁ బూన్పక యహా! విడనాడెడువార లుందురే. ౧౮౬

చ. పలుకులు వేయునేటి కిఁకఁ ౹ బంతముమాని వృథాశ్రమంబులం
గలుగఁగఁ జేయు పట్టుదలఁ ౹ గా దన కింతటఁ బాఱఁదోలి తో
య్యలి పితృమాతృవాక్యముల ౹ న్యాయ్యములన్ గ్రహియించి శ్రీపతిన్
జలరుహనేత్రు నాథునిగ ౹ సమ్మతిఁ గోరుము మేలుగల్గెడున్. ౧౮౭

పార్వతి కపటమునికి శివమహత్త్వ మెఱిఁగించుట.

చ. అనుటయు శంభుదూషణము ౹ లౌనుడు లార్తిని బెంచుచుండఁగా
వినక శివాంఘ్రిపద్మముల ౹ వీడనిచిత్తము నించుకేమర
ల్పను బనిపూన కాగ్రహము ౹ పల్మఱుఁ జిత్తముఁ బైకొనంగ నుం
డిన నిసుమంత యాపుచు పదిన్ బలికెన్ గుహనామహేశుతోన్. ౧౮౮

క. పిలువని పేరంటమునకుఁ, గలరయ్యా! పోవువారు ౹ కాదని చనినం
గలుగునె యట మర్యాదయు, నలుగురిలోఁ గల్గుఁగాక ౹ నగుఁబాటు లాగిన్.

క. ఈనానుడి నీయందుం, బూనందగు నన్వయింప ౹ బుధవర! నీవెం
దే నేగెదవో పొమ్మిఁక, నీనుడి విన నిచ్చగింప ౹ నేను నిజముగన్. ౧౯౦

చ. అడిగినవారికే తెలుప ౹ నౌ హిత మయ్యది వీటిఁబుచ్చి నీ
వుడుగక నా కొగిం దెలుపుచుండుట పాడియెగాదు నిన్నుఁబో
లెడు పురుషాళికిన్ హరుని ౹ లీల లెఱుంగఁగ శక్య మెట్టులోఁ
దడయక యింకఁ బొమ్ము దురితంబుల యార్జన మేల చేసెదో. ౧౯౧

సీ. కౌశేయకంబులు ౹ గజచర్మ మెవ్వానిదృష్టికి సమముగా ౹ నెసఁగుచుండుఁ
జారుగంధంబు భస్మము నొక్కభంగిగా నేమహాత్ముఁడు చూచు ౹ నేమమూను
మణిహారముల ఘోరఫణిహారముల నొక్కకరణి నేహరుఁడు చొక్కంగఁదాల్చు
నమృతంబు దారుణహాలాహలం బొక్కగతి నేశివుఁడు త్రాగుఁ ౹ గడుముదమున

ఆ. నట్టిసర్వసముని ౹ నఖిలేశు సర్వజ్ఞు, నమరసేవితాంఘ్రికమలు వేద
వేద్యమహిముఁ బరము ౹ విమలు శంకరు నీవుఁ, దెలియఁదరమె యేలపలికె దిట్లు.

ఉ. ఎన్ని భవంబు లెత్తిన నహీనవిభూషణుఁ గొల్చునట్టి భా
గ్యోన్నతిగల్గు జన్మ మది । యుత్తమమైతగు నంచు జ్ఞానసం
పన్నులు నిర్వచింతు రది । బాగని తోఁచెను నాకు నట్లుగా
న న్నియమంబుఁ బూనితిని । నాథునిగా హరుఁ బొందుకోరికన్ ౧౯౩

చ. కరుణకుఁ దావలంబయి జగంబుల నెవ్వరు తన్ను వేఁడినన్
బరుగునవచ్చి వారలకు । భద్ర మొసంగుచు నిర్వికారుఁడౌ
పరమశివుండు నా కొసఁగు । భద్రము లియ్యది నిశ్చయంబు మా
నిరమణ! చాలు నింక శివునిం దెగడన్ జనవయ్య యింటికిన్. ౧౯౪

మ. తొలిజన్మంబున నీ వొనర్చినయఘస్తోమంబు నిన్నిట్లు శ్రీ
గళు దూషింపఁగఁ బ్రోత్సహించె నిది నిక్కం బంచు భావించెదన్
గలరే శంకరు నిందచేయుమను లోకాలంబునందైన దు
ష్టులె దూషింపఁగఁ బూనువారలు కడుం బాపైకకృత్యాదృతిన్. ౧౯౫

మ. వినవయ్యా! మునిబాలకా! శివుని సద్వృత్తాంత మే నించుకే
వినిపింతున్ దను నెవ్వరేఁ దెగడి యావెన్కం క్షమింపంగదే
యని వేఁడన్ క్షమియించి భక్తునిగనే । యాత్మం దలంచున్ హరుం
డనఁ దార్కాణము దక్షుఁడే యగుఁ దుషారాంశుండు నా నెన్నఁగన్. ౧౯౬

శా. ఎన్నేఁ దప్పు లొనర్చి యవ్వలఁ బ్రభూ । యీతప్పులన్ జేసితిన్
మన్నింపందగు నంచు వేఁడగనె సమ్మానించు సుంతైనఁ దా
నెన్నం డాయపరాధసంఘముల విశ్వేశుండు నిర్ద్వంద్వుఁ డా
పన్నత్రాణపరాయణుండు వినవో । [1]ప్రాగ్విద్యలం దన్నుతుల్. ౧౯౭

ఉ. జ్ఞానలవంబులేని మృతకల్పులు కొందఱు విష్ణు వొక్కఁడే
కాని శివుండు ముక్తిదుఁడు । కాఁడని యందురు వేదరాశియే
పూని వచించు శంకరుఁడె । ముక్తిదుఁ డౌ నని స్వప్రకాశుఁడే
యౌ నని భూతనాథుఁడగు । నంచును వేఱొకమాట యేటికిన్. ౧౯౮

చ. ఎవనికి నింక జన్మమది । యెన్నఁగ లేదొ యతండె భక్తిచే
శివుని పదాంబుజద్వయముఁ । జిత్తపదంబున నిల్పి కొల్వఁగాఁ
దివురు ననేకజన్మములఁ । ద్రిమ్మరఁజాలు నతండె యీశ్వరుం
గలిసి శ్వసంతతుల్ మొఱుఁగుకై వడి దిట్టుచునుండు నెప్పుడున్. ౧౯౯

ఉ. ఎవ్వనిమన్యు వొక్కత్రుటి । నెల్లజగంబుల రూపుమాపునో
యెవ్వని సత్కృపాకణ మదెల్లర యార్తులఁ బాపఁజాలునో
యెవ్వనిభూషణవ్రజము । లీశ్వరతన్ దగఁ దెల్పుచుండునో
యవ్వరమూర్తి శంకరు మహాత్మ్య నెఱుంగఁగ నీకు శక్యమే. ౨౦౦

1 ప్రాగ్విద్యలు = వేదములు.

చ. పరులకు హింసఁగూర్చుటకె ౹ పాల్పడుక్రూరభుజంగరాజి యే
హరునకు భూషణంబులయి ౹ యాదృతిమీఱఁగఁ గొల్చుచుండు భీ
కరతరభూతరాశి కలకాలము సేవ లొనర్చుచుం దమిం
బరిచరు లట్టులుండు నలభర్గునిశక్తి నెఱుంగఁజాలుదే. ౨౦౧

సీ. ఈశుఁడై సర్వలోకేశుఁడై నతహృషీకేశుఁడై సర్వభూతేశుఁ డగుచు
దాతయై ధర్మనిర్మాతయై దేవతానేతయై దుష్టైకజేత యగుచు
మోదియై మునిహితోపాదియై యజశిరశ్ఛేదియై త్రిపురవిభేది యగుచుఁ
బాత్రుఁడై కార్ముకగోత్రుఁడై శ్రుతికృతస్తోత్రుఁడై నిర్మలగాత్రుఁ డగుచు
తే. శాశ్వతానందుఁడై మహాశాంతుఁడగుచు,విజితకందర్పుఁడై జ్ఞానివేద్యుఁడగుచు
నలరు సర్వజ్ఞు సర్వగు ౹ హరుని నిట్లు, తూలనాడంగ నీకెట్లు ౹ తోఁచె మాని.

చ. గురువుల దేవతావళిని ౹ గొంకక తూలఁగనాడుజాల్ము ని
ష్ఠురహృదయుం గనుంగొనఁగఁ ౹ జొప్పడుఁ బాప మటంచుఁ బెద్ద లం
దురు పరమేశ్వరుం హరుని ౹ దోఁచినయట్టులు నిందచేయు నీ
చరతుని నిన్నుఁ జూడ నఘసంతతి యబ్బును గానఁ బో మ్మికన్. ౨౦౩

చ. హితముదొఱంగి సర్వజగదీశ్వరుఁ దూలఁగనాడు నిన్ను మ
త్కృతసుకృతాయుధంబునఁ ౹ బరేతవిభుంగనఁ బుచ్చవచ్చుఁ గా
ని తపముకల్మియుం దఱుఁగు ౹ నిర్భరతావక దుష్కృతాగ్ని యే
నిను వడిఁ గాల్చు నం చెఱిఁగి ౹ నే నిపు డూరకయున్నదానఁ జూ. ౨౦౪

శివుఁడు ప్రత్యక్షమై పార్వతికి వరము లిచ్చుట.

చ. అనుచు రుడుగ్రహవ్యవహు ౹ నాయతకీలలుపర్వ దృగ్ద్వయం
బునఁ గనుపట్టఁ జూచుటయు ౹ భూతవిభుం డిఁక నూరకున్నఁ ద
ప్పును బని యంచుఁ దత్తనువుఁ ౹ బోవిడి యంతట నైజరూపముం
గనఁబడఁజేసెఁ బార్వతికిఁ ౹ గన్నులపండువుగాఁగ నత్తఱిన్. ౨౦౫

సీ. గంగాతరంగిణీ ౹ రంగత్తరంగరవంబులు కర్ణహితంబుఁ గూర్పఁ
గమ్రహిమాంశురేఖయు భూషణంబయి దృగ్ద్వయంబునకు మేలెంతొ నింప
ఫాలభాగమ్మున ౹ భాసిల్లు శుచినేత్ర మార్తులకష్టవహ్నాళిఁ గాల్ప
రవిచంద్రరూపనేత్రములు భక్తాంతస్తమస్సంతతుల రూపుమాపుచుండ
తే. సారకరుణారసంబు విశాలనేత్ర, కమలయుగళాంతములనుండిసమయ మెఱిఁగి
యట్టె ప్రవహించుచుండఁ జూపట్టుశివుని, భక్తరక్షణదీక్షుని ౹ బరమశుభదు.

చ. కనుఁగొని మత్ప్రవాహమున ౹ గాఢనిమగ్నమనస్సరోజయై
దనయొనరించినట్టి దగుదారుణభాషణముల్ త్రపాభరం
బును గదియింప వేగముగ ౹ మోమును వంచి మహేశుపావనాం
ఘ్రినళినయుగ్మముం గనుచుఁ ౹ గేవలభక్తి భజించుచుండఁగన్. ౨౦౭

సీ. తొలుదొల్త భయ ముప్పతిలి కంపమొదవ నాశ్చర్యంబుఁ దనువువిసంజ్ఞఁజేసె
నద్దానిఁ బైకొని । యమలభక్తి మహేశుపదములకడ నిల్వ । మది నొనర్చె
నయ్యది పరికించి । యతివేగముగ వాంఛ లాచిత్తవిశ్రాంతి । నట్టె మాన్పె
నంతట బుద్ధికార్యం బెద్దిచేయనొ నింకని తర్కింప । బింకమూనె

ఆ. నంతలోన వ్రీడ । యన్నింటిఁ బైకొని, యెద్దిచేయ నిశ్చయింపఁ జాల
కుండఁ జేయఁజాలి । యుండె మహాదేవుఁ,డోలి వానిఁ గనుచునుండె నెలమి.

ఉ. అంత హిమావనీధ్రతనయామణి యించుక శాంతినూని య
త్యంతకృపాసముద్రు నభయప్రదు శంకరుఁ దృష్టిఁ గాంచుచున్
సంతసమెంతయుం దను వొసం బురికొల్పఁగ మ్రొక్కి నిల్చి యీ
వింత పొసంగనేల యని । వేమఱు నెంచుచునుండ నీశుఁడున్. ౨౦౯

ఉ. సుస్మిత మాస్యపద్మమునఁ । జొక్కి నటింపఁగఁ బర్వతాత్మజా!
విస్మయ మొందనేల? నిను । వే విధులం బరికించి మెచ్చితిన్
సుస్మరణీయ మీతపము । క్షోణిఁ గలట్టిమహర్షి రాజికే
[1]ఘస్మర యోగిరాశి నినుఁ । గాంచి త్రపం గనువారు సుమ్మికన్. ౨౧౦

చ. వయసునఁ బిన్నదానవయి । భక్తిభరంబునఁ బెద్దదానవై
నయమున మేలుబంతివయి । నాతిరొ మించితి వీతపంబునన్
జయమును గాంచి తీవు పలుసారులు నిన్నుఁ బరీక్ష చేసి మె
చ్చి యభిమతార్థముల్ గలుగఁజేయఁగ వచ్చితి నీదుచెంతకున్. ౨౧౧

క. పంచమహాభూతంబులు, వంచింపఁగ లేక నిన్ను । వదలె ననఁగ నీ
యంచితతప మిది యసదృశ,మంచున్ వచియింపవలెనె । యన్నులమిన్నా. ౨౧౨

మ. ననుఁ బాణిగ్రహణంబుచేయుటకు నోనారీమణీ నీవు పూ
నిన మాన్పింపఁగ నెంద ఱెన్నొ విధులన్ । నేర్పొప్పఁగాఁ దెల్పి య
వ్వనజాక్షుం బతి నీవు కైకొన మదిన్ । వాంఛింపఁగాఁ జేయఁబూ
నినయారీతుల నే నెఱింగితిఁ జుమీ । నీవాంఛితంబున్ గడున్. ౨౧౩

ఉ. మెచ్చితి నీదునిష్ఠకు నమేయఫలంబుల నొందఁగోరి నీ
విచ్చటనుండ నీమన మదింకను మార్పును గాంచునేమొ యే
పొచ్చెము లేక సుస్థిరతఁ । బొల్చునొ యంచుఁ బరీక్ష చేయఁగా
ముచ్చట నొంది యిప్పగిది । ముగ్ధ! వచించితి నంచు నెంచుమా. ౨౧౪

చ. పలుకులఁ గాలముం గడుప । బాగిఁకఁ గాదు భవన్మనోరథం
బులు ఫలియింపఁజేయు వరముల్ కరుణింపఁగ వచ్చితిం గదా
పొలఁతిరొ వేఁడు మిష్టవరముల్ త్రప నూనకు మింక నన్న యీ
శులలితవాక్కు లట్టె విన । శ్రోత్రయుగం బొఁగిఁ దృప్తినొందఁగన్. ౨౧౫

---

1 ఘస్మరులు = కుక్షింభరులు.

చ. శిరసొకయింత నెత్తి విధుశేఖరు వక్త్రహిమాంశు నెంతొ యా
దరమునఁ గాంచి తన్నయనతామరసద్వయ విచ్యుతార్తిసం
హరణ కృపామృతార్ద్ర విమలాయతదృష్టులు సోఁక నెమ్మనం
బరుదుగ హాయి చెందఁగఁ గృతార్థగఁ దన్నుఁ దలంచుచున్ దమిన్. ౨౧౬

ఉ. దోసిలివట్టి పల్కె దయతో ననుఁ బ్రోవఁగ వచ్చియున్న దే
వా! సకలేశ్వరా! దృఢతరాజ్ఞతఁ బల్కిననావచస్సులం
దోసములన్ క్షమింపు మిదె దోసిలియొగ్గి భజించుదాన న
న్నీసమయంబునన్ సఫలకృత్యగఁ జేయుము దీనరక్షకా. ౨౧౭

చ. మనసునఁ దొల్త నేపురుషమండనుపై నిడునో పురంధ్రి యా
తనినె గ్రహింపఁగాఁదగును దప్పక నాథునిగాఁగ నంచు శా
స్త్రనిచయముల్ విధించు నని సాధుమతుల్ వచియింప వింటిఁ గా
వున నినుఁ గోరితిం దొలుత భూతపతీ! హృదయాధినాథుగన్. ౨౧౮

శా. ఈనాయూహ మరల్ప శక్యమగునే యెవ్వారికే నిద్ది యె
ట్లైనన్ సిద్ధిని గాంచదేని భవదీయాంఘ్ర్యర్పణార్థంబె యీ
మేనున్ యోగభవాగ్ని కాహుతిగ నొప్పిం జేయఁగా నెంచి యు
న్నా నోదేవ! ననున్ గ్రహింపు సతిగా నాపుణ్యముల్ పండఁగన్. ౨౧౯

చ. తపము ఫలించు నెత్తఱిని దర్శనమిత్తువొ యప్పు డంచు శా
స్త్రపథముఁ జక్కఁగా నెఱుఁగు ధన్యులు పల్కుదు రట్టులే మహే
శ! పరమభాగ్యదాయకము సన్మునిముక్తిఫలప్రదంబునై
న పదయుగంబుఁ బావకము నాథ! కనుంగొని ధన్యనైతిఁగా. ౨౨౦

ఉ. నీవు పరీక్ష చేసెదవు పూనిం దగఁ బూనిననే మునీంద్రుఁడే
నేవిధినైన నిల్చి కృతకృత్యత గాంచఁగఁ జాలునే యనం
గావధు వెట్టు చాలు నిది గాఢభవత్కరుణాఫలంబె యా
నీ విక నన్నుఁ జేకొనెదు నే ర్పదియెట్టిదొ నాకుఁ దెల్పుమా. ౨౨౧

శా. నీపాణిగ్రహణంబె కోరితి మదిన్ నీరేజపత్రాక్ష! వా
ణీపేంద్ర ప్రముఖామరార్చితపదా నీపాదపద్మార్చన
వ్యాపారంబున సర్వకాలము ననున్ వర్తింపఁగాఁ జేసి మో
దాపారాంబుధి నోలలాడ వర మీయుమా! భక్తకల్పద్రుమా! ౨౨౨

చ. అనుచుఁ బ్రకంపమాన మృదుహస్తసరోరుహయుగ్మబంధయై
వినయవిభూషణం బమర వేఁడు హిమాచలపుత్రికామణిం
గనుఁగొని శంకరుం డనియెఁ గామిని నీ విటు నన్నుఁ గూర్చి పా
వననియమంబు సల్పితివి వాంఛ ఫలింప వరం బొసంగితిన్. ౨౨౩

ఉ. నారదమౌని మేనయు మనంబును మార్పఁగఁ బూని యెన్ని యో
పారులు నన్ను దూషణము సల్పుచు బుద్ధులు నేర్పి రట్లు వే
సారక నీదుతండ్రియును జక్రధరుం డధిపుం డటంచు నే
భూరిదరిద్రదోషమును బూనితి నంచు వచించి రెంతయున్. ౨౨౪
ఉ. ఎంద ఱవెన్నిసార్లు వచియించిన వానిని లెక్కపెట్టకే
డెందమునందు నాసిరి గణింపక నన్నె వరించియుంట నే
నిందు నినుం గనంగ వరమీయఁగ వచ్చితిఁ జుమ్ము పార్వతీ!
ముం దొకచిత్రముర్ సురసమూహము గానఁగఁ జేయఁగాదగున్. ౨౨౫
శా. దానిం దెల్పెద నాలకింపు గిరిజాతా! నిన్నుఁ బ్రేమంబునం
గానంగాఁ జనుదెంచు నియ్యెడకు నాత్మాభృత్ప్రభుం డెల్లయే
మేనాదేవినిగూడి నారదుఁడు మేలౌ లంచు వర్ణింప నెం
తే నన్ దూఱుచు నీతపం బుడుప నేవే నీతులం దెల్పుచున్. ౨౨౬
మ. నినుఁ గొంపోయి యదే విధానముననే నీరేజపత్రాక్షుఁ గై
కొనఁగాఁ జేయఁగఁ బూనువార లిది నీకుం దెల్పఁగా నెంచితిన్
గనుకన్ నీవు స్వయంవరంబునఁ బతిం గైకొందు నంచుం బ్రతి
జ్ఞను జేయందగు దాని మార్ప నెటులే శక్యంబు గాకుండఁగన్. ౨౨౭
ఉ. వచ్చినబంధువర్గమున బాలు ద్వివర్షవయస్కు నొక్కనిన్
ముచ్చటమీఱ నీజననిముందఱ నుంచి యమర్త్యులందు నే
పొచ్చెములేనివాఁ డితనిఁ బూనిక నెత్తికొనంగ నేర్చునే
నిచ్చపలాక్షి నాదుహిత నీగిరిజన్ వరియింప నర్హుఁడౌ. ౨౨౮
మ. అని నీతండ్రి వచింపఁజేయు మటులే యంచున్ సురేజ్యుల్ ముదం
బున నాబాలుని నెత్తికోఁదలఁతు రెవ్వారల్కిన్ బ్రయత్నంబుచే
సిన నెవ్వారి కశక్యమేయగుఁజుమీ చిత్తంబునం దించుకే
ననుమానింపకు మాకు మారుఁడు నితాంతస్ఫారదర్పం డగున్. ౨౨౯
క. మానసపుత్త్రుఁడు నా కని, మానిని దలపోయు మతని మాధవుఁ డెత్తం
గా నేల చాలఁ డనునను,మానముఁ బూనకుము నమ్ము మాటను దీనిన్.
చ. హరిహయుఁ డబ్జసూతియు మురారియు నాతని నెత్తఁజాల రిం
కొరులు సమర్థు లంచు మది యోజనచేయఁగ నేల? నేనె యో
తరుణిరో! వాని నెత్తుకొని తావకవాంఛ ఫలింపఁజేయుదున్
హరునిసుభాషితంబు లెపుడైన ఫలింపక యుండవచ్చునే. ౨౩౦
ఉ. [1]ద్వాపర మించుకే మదిని బాదుకొనంగ నొనర్ప కిచ్చటం
గాపురముం బొనర్పఁ గుతుకంబును గాంచక తల్లిదండ్రులుం

[1] ద్వాపరము = సందేహము.

దాపసుఁడుగా నిసుం గనఁగ ౹ దాపును జేరకముందె కార్యధీ
తాపరతంత్రవై మెలఁగు ౹ చాలశుభంబులు నీకుఁ గల్గుతన్. ౨౩౨

మ. ఇఁక నేఁ బోయెద నాసభన్ మరల నీకాగాంచంగ నేనెంతు న
ర్భకుఁ డెట్టిండని యెంచఁబోకు మిభవక్త్రస్ఫూర్తిఁ జెన్నారు నా
దుకుమారుం డనినిశ్చయింపు మతనిన్ ౹ దోర్వీర్యసంపన్ను న
స్త్రకళాభిజ్ఞునిగా నెఱుంగు మెవ రెత్తం జాల రబ్బాలకున్. ౨౩౩

చ. అతఁడు మదాజ్ఞ బాలకునియట్లుగఁ దోఁపఁగఁజేయుచున్ సుర
ప్రతతులు నిండియుండెడు సభాస్థలియందు స్తనంధయుండుగా
జతనము దీనిఁ గాంచుట కె ౹ సత్వము గన్పడకుండ నుండుఁజు
మ్మతనినె నీవు కోరుదు వహార్యమదాజ్ఞయె ప్రోత్సహింపఁగన్. ౨౩౪

ఉ. ఎల్లరు సమ్మతింత్రు హరిణేక్షణ! యీశపథంబు సంగతం
బెల్లవిధంబులం గనఁగ ౹ నీతని నెత్తుట లీలగాదె యం
చుల్లములం బ్రమోదరస ౹ ముప్పతిలన్ సమయంబు దీర్పఁగాఁ
జెల్లు నటంచుఁ బూనుదురు ౹ చిత్తములెల్లను దత్తఅంపడన్. ౨౩౫

చ. సమయ మి దెవ్విధిన్ సభను ౹ సాగునొ నాదగు భాగ్యమెట్టిచం
దమున ఫలించునో యెవఁడు ౹ తచ్ఛిశువుం బయికెత్తునో యటం
చు మనసునం దలంచుకొనుచున్ వగ నొందకు మేను బల్కిన
ట్లమరసభన్ ఫలించు నఖిలార్థము లొక్కకొఱంత లేకయే. ౨౩౬

ఉ. నమ్ము త్రిశుద్ధిగాఁ బలుకునాయది దీని మృగేక్షణా! మనో
జ్ఞమ్ముగ వీచువాయువులు ౹ చక్కనికోయిలకూఁతలున్ సుగం
ధమ్ములఁ గ్రుమ్మరించు సుమసంస్తతిభారవినమ్రవీరు దో
ఘమ్ముల చాలనంబును నిశామము నీకు శుభంబుఁ దెల్పెడున్. ౨౩౭

ఉ. మంగళముల్ చెలంగును హిమక్షితిభృద్వరకన్యకామణీ
యింగితవిద్వరిష్ఠ వసుశెల్లను దెల్లమయయ్యె నాకు నీ
యంగదలెల్లఁ బాసె నిఁక ౹ హాయిగ నుండుము కోర్కెలెల్లఁ బం
డెంగద యేగువాఁడను గిఱిందిమగంటిమిఁ జూపుదున్ సభన్. ౨౩౮

చ. అనుచుఁ గటాక్షవీక్షణము ౹ లల్లనఁ బర్వఁగఁ జేయుచున్ ద్రిలో
చనుఁ డపు డం దదృశ్యుఁడయి ౹ స్వర్ణగిరిం దగుమానిరాట్సభం
గనఁబడెఁ; నంతటన్ గిరిజ ౹ కాంక్షితముల్ ఫలియించునన్న శం
భుని హితవాక్యముల్ తమిని ౹ బొంగఁగఁజేయఁగ విశ్వసించుచున్. ౨౩౯

మ. హరపాదాంబురుహద్వయంబు మదిలో ౹ ధ్యానించు చుండెన్; గిరీ
శ్వరుఁ డాపార్వతిసేమముం దలఁచుచున్ ౹ స్వాంతంబు పొక్కంగ ని

ర్జరమానీంద్రుఁడు ప్రోత్సహింపఁగఁ గళఽత్రం బట్టి దుఃఖార్తిచేఁ
బురికొల్పం జనియెం గుమారి నియమంఽబుం బూనునచ్చోటికిన్. ౨౮౦

హిమవదాదులు పార్వతికడకు వచ్చుట.

ఉ. మేనకయుక్ సురర్షియును ఽ మేలుదలంచుచుఁ గూడఁబోయి య
మ్మానినిఁ గాంచి రంతట హిఽమక్షితిభృద్వరుఁ డాత్మజామణిం
జానుగఁ జెంతఁ జేర్చికొని ఽ స్వాంతము మార్దవ మొందునట్లు స
మ్మానముమీఱఁ బల్కెను బ్రఽమాదము లొందక కాన నుందువే. ౨౮౧

సీ. మృదుతమతనువల్లి ఽ మేటిఝంఝావాతహతినిట్లు వాడెనే ఽ యమ్మకాన
సొగసుకీల్జడ ధూళిఽసోఁకుట బిఱుసయి యలరారకున్న దే ఽ యమ్మకాన
పున్నమచందురుఁఽబోలు నెమ్మొగ మెంతో యార్తిని గుందెనే ఽ యమ్మకాన
పల్లవంబుల డిందుఽవడఁ జేయుపాదమ్ము లిమ్మాడ్కిఁ బొక్కెనే ఽ యమ్మకాన

తే. ఆఁకలియు డప్పియును నిన్ను ఽ నలముకొనఁగ
నధికకష్టమ్ము లొందితే ఽ యమ్మకాన
యేటిగ్రహచార మిది కాన ఽ నిట్టులుండఁ
దినఁగఁ గట్టంగఁ గొదువయఽయ్యెనె తలంపు. ౨౮౨

చ. కలుముల కాటపట్టగు [1]నిఽకాయ్యము లెన్నియొ కల్గియుండఁగా
విలసితరత్నభూషలును ఽ వేలకువేలుగ నొప్పియుండఁ గా
నల నివసించి యాకులఁ దిఽనంగ ని దేదురదృష్టమొక్కొ యో
జలజనిభేక్షణా! తెలియఁఽజాల నిఁకైనను దీని మానుమా. ౨౮౩

శా. దీనిన్ మానఁగఁజాల నంచు మదిలోఁ ఽ దీండ్రించుకోపాగ్ని నా
పై నం బర్వఁగఁజేయఁ జూచెదవొకో ఽ బాలా! నినుం గాంచుచున్
నేనున్ మేనయు నిందె నిల్చి తపముం ఽ దీవ్రంబుగాఁజేసి యీ
మేనుల్ వాయుదు మింతవట్టు నిజమా ఽ [2]మేపుట్టువా! నమ్ముమా. ౨౮౪

చ. జనకులు నీనిమిత్తమయి ఽ శర్మములన్ విడనాడి కానలో
వనటఁ గృశించి చచ్చుటయె ఽ బాగని నీమదిఁ దోఁపదేని నీ
దు నియమముం ద్యజించి మముఁ ఽ దోడ్కొని యింటికిఁ బొమ్ము పార్వతీ!
మనమున నెంచి యింకఁ దగుఽమాట వచింపుము మానిముందటన్. ౨౮౫

తరళము:—

జననియున్ జనకుండు కోరిక ఽ సంతతిం గన నెన్నఁగా
ననువుగాని విధంబునన్ నియఽమావళిం గయికొంచు దే
వునిపదంబులఁ గొల్చి తత్కృపఁ ఽ బొందువారు ఫలంబుగాఁ
దనయులం దనుజాతలన్ మదిఁ ఽ దచ్ఛ్రమంబుఁ దలంపుమా. ౨౮౬

ఉ. కన్నదియాదిగాఁ బొసఁగుఽకష్టములెల్ల సహించి పెంచి యే

---

1 నికాయ్యములు = గృహములు. 2 మేపుట్టువు = పుత్త్రిక.

మన్న క్షమించి వారిదగుహార్షము స్వీయముగాఁ దదార్తిఁ దా
మన్నివిధంబులం గుడిచి యల్లన వృద్ధికిఁ దెచ్చుచుండు వా
రి న్ననబోఁడి సంకటపరీతమనస్కులఁ జేయు టొప్పునే. ౨౪౭

చ. బదులొనరించి తీర్చుకొన వచ్చుఁ బరోపకృతిం గృతజ్ఞుఁడై
సదమలగాత్రి! యేబదులుసల్పిన మాతృపితౄణ మింతయై
నఁ దఱుగఁజాలునే? వెదకినం గనుపట్టదు దానిఁ దీర్చున
య్యది యెదియైన లోకముల నారయుమా భవదాత్మ దీనినిన్. ౨౪౮

ఉ. తల్లిని దండ్రినిన్ సరిగఁ దన్పఁగఁజాలిన దొక్క కార్యమే
యుల్లముఁ బల్లవించునటు లొప్పుగఁ దాను దదాజ్ఞలోన వ
ర్తిల్లుట, దానఁ దప్ప మఱిదేనను వారలఁ దన్పరామి సు
త్ఫుల్లసరోజనేత్ర! తలపోయుము చక్కని త్రోవ నొక్కటన్. ౨౪౯

చ. పరులువచించుభాష లొకపట్టునసైన మనంబులోపలం
జొరఁబడనీకుమా యవి యశోభనముల్ పరిణామకాలమం
దురుతరదుఃఖదంబు లగుచుండు నటం చొగి నిశ్చయింపుమా
త్వరపడి యింకనైన మదుదారవచస్సుల నాదరింపుమా. ౨౫౦

ఉ. పెద్దలు పిన్నవారలకుఁ బెంపుసుగూర్పఁగఁ గోర్కి మీఱఁగా
బుద్ధులు నేర్పఁబూనుదురు పోకడలెల్లను శాస్త్రరీతిఁగా
దిద్దఁగనే తలంత్రు సుదతీ! వినవొప్పదె వారివాక్తతిన్
సుద్దులు వేయునేల? మదిఁ జొప్పడఁ జేయుము నాతలంపులన్. ౨౫౧

ఉ. సర్వవిదుత్తముం డితఁడు సన్ముని నారదుఁ డిట్టివాఁడె యా
శర్వునిమాని లోకపతిఁ జక్రధరున్ బతిఁ గూర్పనెంచె నీ
యుర్వర నింక నిట్టిహితుఁ డుండునొకో మన కెందుఁ దల్లి! హృ
త్పర్వముగా వరింపుము సుపర్వగణేశ్వరు భార్గవీవిభున్. ౨౫౨

ఉ. నీమది నాటియున్నయది నింద్యమె యాననియెల్లవారలున్
భామిని! నాకుఁ దెల్పిరి సెబాసని వారలు మెచ్చునట్లుగా
శ్రీమహిళాధవున్ బతిగఁ జిత్తమునన్ గయికొమ్ము మాకు నెం
తో ముదముప్పతిల్లునటు లుద్యమమును బొనరింపు మింతటన్. ౨౫౩

చ. అనుచుఁ గపోలయుగ్మమును హస్తతలంబుల దువ్వుచున్ మనం
బునఁ గనుపట్టుసుమ్మలికఁ బొంగెడునశ్రుకణాళి మస్తకం
బును దడుపంగ నున్న హిమభూధరవర్యుని పార్శ్వమందు ని
ల్చినజనయిత్రి మేనను నిలింపమునిన్ మెలమెల్లఁ గాంచుచున్. ౨౫౪

కవికంఠభూషణము:—

శిర మట్టి యెత్తి వగఁజెందెడు తండ్రిని తల్లినిన్ మహా
దరమొప్పఁ గాంచి మునితల్లజునిన్ వినయంబుమీఱ భ

క్తిరతిఁ నమస్తుతిని ౹ ధీవిభవంబు గనంబడంగఁ జే
సి రయంబు మీఱఁగను ౹ జేసె విధిఁ మరియాద వారికిన్. ౨౫౫

మ. తలిదండ్రుల్ మునివర్యుఁడుఁ దనిసి రా౹తన్వంగి మర్యాదకుఁ
గలిగెఁ వారికి నమ్మకంబు తమదౌ౹కార్యంబు సర్వం బికఁ
ఫలియించుఁ గిరిజాస్వభావమును మా౹ర్వంగంటి మి ట్లంచు; న
వ్వాల శాతోదరి మెల్లమెల్లనఁ దమిఁ ౹ భాషించె నీరీతిగన్. ౨౫౬

చ. జనకునియాజ్ఞ మానిపరు౹శాసనముఁ దలఁదాల్చుదాన నై
నను వరనిర్ణయం బిపుడె ౹ నానుడులఁ వెలిపుచ్చ నెంచకుం
డని మిము వేఁడుదాన సభ౹యం బొసఁగందగు మీరు నాకు దై
వనియతి మీఱరా దనె౹భావము నామదిఁ దోఁచెడుం గడున్. ౨౫౭

చ. అనుటయు వార లానుడుల౹యందలి యర్థవిశేష మీశ్వరే
చ్ఛ నెఱుఁగఁజాల కాగిరిజ ౹ చక్రి వరింపఁగ నెంచియే వచిం
చె నిటు లటంచు నెంచి యటు౹చేసెద మంచు వచించి రంత నీ
శునిపదయుగ్మముం దలఁచు౹చుఁ ఫలసిద్ధిని గాంచఁ గోరుచున్. ౨౫౮

చ. మదిఁగల యర్థముం దెలుప౹మాని తముం గనుసర్వమంగళఁ
ముదమునఁ జూచి యాతుహిన౹భూధరుఁ డిట్లను నింట నున్న యా
సుదతులమిన్న లెల్ల నినుఁ౹జూడఁగఁ గోరుచు నున్నవారు పో
వుద మికఁ జాల మేల నన౹బోఁడి! యటం చొగిఁ బ్రోత్సహింపఁగన్. ౨౫౯

చ. తపమును మానిపోవుటకుఁ ౹ దా నెద సమ్మతిఁ గాంచనట్లు తోఁ
చుపగిదిగా నటించి మధు౹సూదనునిఁ వరియింపవచ్చు నా
దుపరమభాగ్యరాశి యిటు ౹ తూర్ణముగా ఫలియించె నంచు భూ
ధ్రపతి తలంప మానమును ౹ దాల్చె మహేశ్వరునే తలంచుచున్. ౨౬౦

ఉ. జ్ఞానవిదుత్తముం డనఁగ ౹ సన్నుతిఁగాంచిన యల్లదేవతా
మౌనియు శంభునిచ్ఛమెయి ౹ మానినిదౌ తలఁ పిట్టిదం చెదఁ
గానకయుండె; నంతఁ దను౹గాదిలిపుత్త్రిక సమ్మతించుచో
ప్పూనిన దంచు నమ్మి తన౹యుగ్మలినిఁ [1]బఱిటెం జమత్కృతిన్. ౨౬౧

క. ఆసన్న తెల్విగని పే,రాసఁ మేనయును బుత్త్రి ౹ నాదరమొప్పం
గా సదనమునకు రమ్మా, యీసమధికనిష్ఠ నీకు ౹ నేలా బేలా. ౨౬౨

చ. శ్రమములపాలు చేయుటకె ౹ చాలిన యీతపమేల? యన్నవ
స్త్రములకు నేకొఱంతయును ౹ రాదుకదా ప్రమదామణీసమూ
హములు సదా నినుం గొలువ ౹ హాయిగ నుండఁగరాదె చాలదే
కమలదళాక్షిరో! మనకుఁ ౹ గల్గినభాగ్యము భోగ్యమైనచోన్. ౨౬౩

---

1 బఱిటు = మెల్లగా గోఁకుట.

చ. ఇది మొద లీవుమాఖ్యఁ గని ౹ యెన్నఁగరానిసుఖంబు లొంద నా
స్పదమయి యొప్పుప్రాణవిభు౹సంగతి నుండఁగ లోఁదలంపు మో
ముదితరో! తల్లిదండ్రులఁ బ్ర౹మోదమహామృతరాశి నోలలా
డఁ దగును జేయ నీకని క౹డంకఫలింపఁగ బుజ్జగించినన్. ౨౬౪

ఉ. చూపులఁ గొంత లోఁబడిన౹చొప్పుఁ గనంబడఁజేయుచున్ సవి
త్రీపదముల్ గనుంగొనుచుఁ ౹ దెల్వి మఱుంగుపడంగఁజేసి తా
నేపని చేయఁగాఁదగునొ ౹ యెన్నఁగఁ జాలనియట్టు లుండ; హృ
త్తాపమునం గలంగుచును ౹ దల్లి కుమారిక బుజ్జగించుచున్. ౨౬౫

చ. తెలియక యిట్టికష్టములు ౹ తెచ్చుకొనంగఁ దలంచి యెవ్వరో
పలికిన నాలకించి వగ౹పాలయితే మృదుగాత్రి! యంచు మా
టలు వెతఁ దొట్రిలంగఁ గప౹టం బొకయింత యెఱుంగనట్టితో
య్యలిఁ గొనిపోవఁగాఁ దగుప్ర౹యత్నము సేయుఁడు నాథ! యంచనన్. ౨౬౬

తే. వ్యోమయానంబు సిద్ధమై౹యున్న దిందె
యెక్కుమా యని బలిమాలె ౹ నక్కుమరిత
నంత నారదుఁ డ్లల్లె చే౹యంగ నీకుఁ
దగు నటంచు వచించె నెం౹తయును బ్రీతి. ౨౬౭

ఉ. అందఱు తన్ను నిప్పగిది ౹ నాదృతి రమ్మని ప్రోత్సహింపఁగా
నందుల కెట్లొ యొప్పుకొని ౹ నట్లు నటించె హిమాద్రిజాత; యా
నందముమీఱ మేనయుఁ గ౹నన్ మది నేవజనింపఁజేయు నా
సుందరి వస్త్రముఖ్యములఁ ౹ జూచి కనుంగవ నశ్రువుల్ తగన్. ౨౬౮

ఉ. సుంతగ దవ్వునన్ నిలిచి ౹ చూచుచు నెప్పుడు తమ్ముఁ బిల్తురో
వింతయలంకృతుల్ గొనుచు ౹ వేగమపోయి గిరీంద్రపుత్రి నే
వింత మటంచు నెంచు సఖి౹బృందముఁ బిల్చినఁ జేరవచ్చి సం
క్రాంత ముదశ్రుబిందుకలి౹కా సమలంకృత నేత్రయుగ్మమై. ౨౬౯

చ. గిరిజను జుట్టి నిల్చి యిటు ౹ కేవలనిర్దయ మమ్ము వీడి ని
ష్ఠురజపనిష్ఠఁ బూనుటనఁ ౹ జోద్యముగాదె తలోదరీ! యనన్
గరుణ చెలంగ నాసఖులఁ ౹ గాంచి మృదూక్తుల నూఱడించి భూ
ధరపతి వేగిరింపఁ బితృ౹ధామముఁ జేరఁగ నిచ్చగించినన్. ౨౭౦

చ. తనసుత నాసఖీజనముఁ ౹ దాఁ బురికొల్పుచు వ్యోమయాన మె
క్కిన మునితో గిరీంద్రుఁడును ౹ గేరుచు నెక్కినయంత యాన మొ
క్కనిమిషమాత్రఁ జేరెను ని౹కాయ్యము నందలిబంధురాజి వే
డ్క నెదురువచ్చి పార్వతిని ౹ గాఢముదంబున గారవించుచున్. ౨౭౧

చ. తపము ఫలించెనమ్మ మదిఁ ౹ దార్కొనువాంఛలు పండెనమ్మ క

ష్టపడితివంచు నీమొగమె । చిక్కఁగఁ దెల్పుచునున్న దమ్మ యి
ట్టిపనికి నిన్నుఁ బూనిచి సడింగన నెంచినవార లెంత పు
ణ్యపురుషులో తగం దెలుప।వమ్మ గిరీశ్వరపుత్త్రికామణీ! ౨౭౩

క. అని తల్లివంకవారలు, గనికరమున నశ్రువితతి । గ్రమ్మెడుకనులన్
దనుఁ గనుచు వితర్కింపఁగ, వనజేక్షణ యుండె మోము।వాంచి పలుకకే.

ఉ. వేలవుగాన శ్రీవిభుని । వీరవరేణ్యుని మాని భూతరా
డ్జాలసమావృతున్ మునుల।సంగతి నుండువిరక్తు నుజ్ఝిత
శ్రీలలితున్ విషాక్తగళు । సేవితభూధరసద్మ భూషిత
వ్యాళుని గోరితే యనుచు । భామినియోర్తుక నవ్వె నయ్యెడన్. ౨౭౪

చ. శితిగళుఁగూడి శైలవర।శృంగములన్ విహరింప నెంచితో
యతివరో! యీడుజోడయిన।యట్టివరున్ మహనీయభోగసం
తతి గలవాని గోరుకొని । ధన్యతఁ గాంచఁగ నెంచితో కదే
సతు లిఁక నవ్వరే యని దొసంతులు కొట్టి నొకర్తు శైలజన్. ౨౭౫

ఉ. పొంగుచు ద్వీపిచర్మవర।మున్ బరిధానముగా నెసంగఁ గౌ
రంగము కంచుకంబుగను । రాజిలఁ గాననపుష్పహారరా
జిం గనువిందుఁ గూర్చుచుఁ బ్ర।సిద్ధిని గాంచిన శ్వేతకాయమున్
సంగతినుండ వేడ్కఁగన । స్వాంతమునం దలపోసి నిష్ఠఁ బూ
నంగ వనంబుఁ జేరితివొ । నాతి సెబాసనె నొక్కలేమయున్. ౨౭౬

చ. ఒకత్రుటియైన నిన్వదలి । యుండఁగ నోప నటంచుఁ బల్కుదీ
వకట! సరోజనేత్ర! గహ।నాంతరసీమల నింతకాల మీ
వాకతుకవే వసింప నెటు । లోర్చితివో కరుణారసార్ద్రచి
త్తకలిత వౌఁగదే యని నితంబిని యొక్కతె దూఱె మక్కువన్. ౨౭౭

మ. సురనారీమణు లంఘ్రిపంకజములన్ । జొక్కంపుఁబ్రీతిన్ నిరం
తరముం గొల్వఁగ వేచియుండ గురునా।నారత్నభూషాసము
త్కరముల్ కోరినయప్డు రాఁగ సుఖస।ద్మఖ్యాతినొప్పారు శ్రీ
వరుఁ డాత్మేశ్వరుఁడై చెలంగ మనుమా । వామాక్షి! యింకైన నిం
కొరునిం గోరకుమంచొకర్తు సఖి యు।ద్యోగించె బోధింపఁగన్. ౨౭౮

ఆ. కడుపులోనిచల్ల । కదలకుండఁగ నీఁక,నైన నింటనుండ।వమ్మ కొమ్మ!
సమ్మదమ్ముగూర్చు।చతురుని బతిఁజేసి,కొమ్మ యంచు నొక్క।యమ్మ వేఁడె. ౨౭౯

మ. గహనంబందుఁ దరక్షుముఖ్యమృగసం।ఘుం బట్టి దుర్వారకో
పహతిన్ రేఁగి మహాధ్వనుల్ దెసల నిం।పన్ వాని సైరించి కా
మహరున్ నెమ్మది నిల్పి గాఢతప మెమ్మాడ్కిన్ విధిన్ సల్పితో
యహహా! యం చొకబోఁటిమిన్న పొగడెన్ । హర్షంబునం బార్వతిన్. ౨౮౦

చ. నలువురు నీవు పూనుజతోసంబును గాంచి హసింప దిక్కులే
వలువలుగా శ్మశానమె నివాసముగాఁగఁ బిశాచరాజియే
కొలువుడుకాండ్రుగా మునులగుంపులె మిత్రులుగాఁ జెలంగుశ్రీ
గళుఁ బతిఁ గోరితే యని యొకర్తుక గేలియొనర్చెఁ బార్వతిన్. ౨౮౧

చ. అతివరో! నీవుచేసినప్రయత్నము లీమనజాతికెల్ల నీ
చతఁ గలిగించె నేమి యనఁజాలుదు శ్రీయును రూపముల్ సుసం
తతియును బ్రాయముల్ శుభనిదానములై తగులక్షణంబులుల్
వెతకినలేనివృద్ధుఁ గడుబీదతనంబున నొప్పువానినిం
బతిగ నదెట్లు కోరితివొ బాలిక యంచనె నొక్కలేమ తాన్. ౨౮౨

చ. పలువురు సుందరీమణులు బాలశశాంకధరుల్ మహేశ్వరుం
డెలియమి దూఱుచుండిన మృదింగల తత్పదభక్తి వీడకే
పలుకకయుండెఁ బార్వతియు భామిను లంతట నామెచిత్తవృ
త్తులు మరలెం గదాయనుచుఁ దోరపువేడుక నుండి రవ్వలన్. ౨౮౩

ఉ. మానివరుండు తద్గిరికుమారికశీలము గాంచి యెంతయున్
మానసమందు సంతసము మాటికిమాటికిఁ బొంగుచుండఁ దాఁ
బూనినకార్య మెల్ల నొకపోలికఁ బండె నటంచు నెన్నుచున్
శ్రీనిధిసన్నిధానమును జేరఁగఁ బోవఁగ నెంచి యిట్లనున్. ౨౮౪

చ. ధరణిధరేంద్ర! యిచ్చటి యుదంతములెల్ల మురారిసన్నిధిన్
గర మనురాగ ముప్పతిలఁగా వినిపింపఁగఁ బోవువాఁడఁ గా
ర్యరతియుఁ బ్రోత్సహించె నను నాదృతిమై సెలవిమ్ము పోయెదన్
దరుణియు సమ్మతించు నిఁక దానవవైరి నటంచు నెంచెదన్. ౨౮౫

చ. అపుడపు డాతలోదరికి సర్వవిధంబున నమ్మురారిపై
నపరిమితానురాగ మెటు లాత్మ జనించునొ యట్టిరీతులం
గృపతోలఁ కాడఁగాఁ దెలుప నేదగుఁజుమ్ము మహీధరేంద్ర! నీ
వె పరమభాగ్యవంతుఁడ వభీష్టము లొందుమ యింకఁ దత్కృపన్. ౨౮౬

ఉ. ఏమఱుపాటులేక సుత యెవ్విధి మార్పును గాంచఁజాలునో
నీమది నిశ్చయించుకొని నేర్పునఁ జక్కఁగ బోధచేయుమా
నామరియాదఁ గాచుజతనం బొనరింపుము పోయివచ్చెదన్
శ్రీమహిళామనోహరునిచెంతకు నిందలి వార్తఁ దెల్పఁగన్. ౨౮౭

ఉ. నావచనం బసత్యమయినన్ మునిసంఘమునందు దుర్యశం
బావహిలున్ నిజంబు, మరియాదయు పోయిన జీవితం బదే
యా విఫలంబు గాన నటులౌ నటుచేయక శ్రద్ధమీఱ నా
యీవచనంబు సార్థక మదెట్టులగుం బని యట్లు చేయుమా. ౨౮౮

మ. హరునిన్ దూఱకు మద్ది సత్ఫలము నీశయంజాల దద్దాన నీ
గిరిజారత్నము కోపమూని తనకోర్కెన్ బండునట్లే యొన
ర్చురతిం బూనును గాన నట్టిపనికిం ǂ జొప్పింప కెట్లో మహే
శ్వరుపైఁ బ్రేముడి తగ్గుచందమున సంభాషించు టొప్పుం జుమీ. ౨౮౯

చ. వనజదళాక్షువర్ణన మహావార్యగతిం బొనరించుచుండు న
ట్లొనరుపు కుడ్యదర్పణము ǂ లొక్కవిధంబున శ్రీవిభుం డొన
ర్చిన మహనీయకార్యములఁ ǂ జెప్పక చెప్పుచు నుండునట్లు చి
త్రనికరయుక్తి నుండఁదగు ǂ దానఁ దదాశయ మట్టి మాఱెడున్. ౨౯౦

చ. పలికెడుపల్కులెల్ల హరిభద్రచరిత్రములై యెసంగఁగా
వలయును జిత్రముల్ నృహరివైభవముల్ తెలుపంగఁజాలున
ట్లలవడి యుండఁగావలయు ǂ నద్రివరా! బహుభాషలేల? యి
మ్ముల నెదిగాంచినన్ విన విభున్ హరిఁ దెల్పుచునుండఁగాఁ దగున్. ౨౯౧

ఉ. ఎల్లెడలం జెలంగుహరి ǂ యింతిమనోగతుఁడై నిరంతరం
బుల్లసిలంగఁజేయుపని ǂ నొప్పుగఁ బూనుము తన్నుతివ్రజం
బుల్లమునందుఁ జిత్తరువునొప్పున నాటినఁ జిత్తవృత్తులే
మెల్లఁగ మార్పునొందు నిదె ǂ మేటియుపాయము శీతభూధరా. ౨౯౨

చ. సమయమెఱింగి యుక్తముగఁ ǂ జక్రిమహత్త్వము పాడుచుండుచం
దమున సఖీవ్రజంబునకుఁ ǂ దత్పరతన్ హితబోధచేయు య
త్నమిది బయల్పడం దగదు ǂ దాన ఫలించును గార్య మెల్ల స
ర్వము తెలియంగఁజాలుదువు ǂ వచ్చెద యత్నముపండు నత్తఱిన్. ౨౯౩

చ. అని మహతీనినాదమున ǂ నాత్మ నెసంగెడునోంకృతిస్వనం
బనుగతమై చెలంగఁ బ్రమదాంబుధి మున్గుచు నారదుండు శ్రీ
శునిపదముల్ హృదబ్జమునఁ ǂ జొప్పడియుండఁగ యోగశక్తిపెం
పున వియదధ్వమందు వడిఁ ǂ బోయెను గార్యపరత్వ మొప్పఁగన్. ౨౯౪

మ. దివిషన్మౌని చనంగ మేనయు హిమాద్రిస్వామివిభుం డాత్మలన్
వివిధాలోచన లొప్పఁ దన్నియమముల్ ǂ వేవేగ పాటింప నెం
చి విలాసంబులఁ బుత్త్రి దేలుతఱి నీచిత్రంబులం గాంచి తే
యువిదా యంచు రమేశునాకృతుల నెన్నో చూపుచుం జెప్పుచున్. ౨౯౫

చ. మనము విలోభతం గనెడుసమాడ్కి నొనర్చుచునుండి రవ్విధం
బు నెఱిఁగియున్ బ్రియంబున విభున్ శశిశేఖరు లోఁ దలంచుచున్
జనకులు సంతసంపడఁగఁ ǂ జక్రివిచిత్ర చరిత్రగేయముల్
వినుచుఁ దదాకృతుల్ గనుచు ǂ వింతయె తోఁపఁగ నూరకుండెఁ దాన్ ౨౯౬

చ. కొమరితచిత్తవృత్తిఁ గనుఁగొంద మటంచుఁ దలంచు మేనయున్
హిమగిరినాథుఁడున్ మరల నెన్నియొరీతుల విష్ణుదివ్యచి
త్రములను జూపుచున్ బహువిధంబులఁ దెల్పుచునుండి రింతయై
న మరలనట్టి చిత్తమున నాతియుఁ జూచుచు వించు నాదృతిన్. ౨౯౭

క. పరమేశ్వరు వచనంబుల, మరల్ మరలం దలంచి మానస మెంతో
త్వరపడకయుండ నొప్పె ని,తరులకుఁ దెలియం దగనివిధం బమరంగన్. ౨౯౮

క. సర్వావస్థలయందును, శర్వుని పావనతమాంఘ్రిసరసిజముల హృ
త్సర్వమ్ముగం దలఁచుచు నా,పార్వతి సమయంబు తీర్పుపని యెటు లనుచున్.

క. శివవాక్యము మది నెన్నుచుఁ, బ్రవిమలయోగైకసిద్ధివలని ఫలము నా
భవసంగతియొకదా యం,చవధానముమీఱ నిశ్చయముఁ జేకొనుచున్. ౩౦౦

ఉ. చింతలుమాని యుండెఁ దమచెప్పినమాటలు సాదరంబు న
త్యంతము శ్రద్ధయున్ వెలయ నాత్మజయున్ వినుచుంట కెంతయున్
సంతసమంది లోఁబడినచందము తోఁచుట తల్లిదండ్రు లా
వంతయు శంకనొందక ప్రియంబున నుండిరి శంకరేచ్ఛచేన్. ౩౦౧

ఆశ్వాసాంత్యము.

క. శ్రుతిమంత్రహవ్యవాహా, హుతిసంప్రీతాంతరంగ హూహాహాముఖ్యా
ప్రతిమానగానవిద్యా, కృతిసంకీర్తిత సమగ్రకీర్తినిధానా. ౩౦౨

శా. ప్రత్యగ్రత్రిదశార్థనాశ్రవణ[1]వద్రప్రీతియుక్తాత్మకా
నిత్యప్రాభవసంప్రవృద్ధసుయశోనీహారరశ్మిచ్ఛటా
గత్యాత్మీకృతపద్మజాండనికరా క్రవ్యాదదుర్వారగ
ర్వత్యాగార్థధృతాతిభీకర మహాస్త్రవ్యూహరాజత్కరా. ౩౦౩

కమలవిలసితము:—

సురవరమునివరశుభఫలదానా
దరరుచిరతరహృదయవికచాబ్జా
హరి సరసిజభవ హరిహయ ముఖ్యా
మరపతి పరినుత మధురతమాఖ్యా. ౩౦౪

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీ కరుణావాప్త గీర్వాణాంధ్రకవితాప్రాభవ, కాశ్యపాన్వయప్రభవ, శ్రీజనమంచి వంశాంబురాశికుముదినీమిత్ర, సుబ్రహ్మణ్య మనీషిపుత్త్ర, తాండవకృష్ణాపరాభిధేయ శేషాద్రినామధేయ నిర్మితంబైన సర్వమంగళాపరిణయంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ.

---

1 వద్రము = అత్యంతము.

# సర్వమంగళాపరిణయము

## తృతీయాశ్వాసము.



క. శ్రీకాంతాహృదయేశ్వర, లోకేశ్వర శక్రమౌనిలోకార్చిత భా
గ్యాకరపాదాంబురుహా, శ్రీకలితాలాప చంద్రశేఖరదేవా. ౧

ఆ. అవధరింపు మవలిదగు దివ్యవృత్తాంత, మాహిమాద్రితనయ యాత్మయందు
శంభువరము నమ్మి సమయంబుఁ ద్రోయుచు,నుండ నంత నారదుండు చనుచు.

చ. మనమున నెంచెఁ బార్వతి యమానుషచర్యల లోఁదలంచినన్
వనరుహనేత్రుఁ గైకొనెడుభంగియె తోఁపదు మౌనిదుస్తరం
బనఁదగు తత్తపంబునకు నాపరమేశ్వరుఁ డాత్మ మెచ్చి యే
మనివర మిచ్చునో విధి యహార్యగతిం దగుఁగాదె యెప్పుడున్. ౩

చ. జనకులవాక్యముల్ వినినజాడ రవంతగఁ దోఁచెఁ గాని యా
వనితదృగుత్పలంబుల ప్రభల్ కడు సందియమంద నాస్పదం
బును గలిగించె సమ్మతిని బొందినయట్లు నటించుచందముల్
కనఁబడెఁ గాని సూనృతముగా మదిఁ దోఁపదు చక్రిఁ గోరుటల్. ౪

చ. తొలుతనె చక్రి స్వాశయము దోఁపఁగఁజేసెను గాని సందియం
బుల కవకాశలేశమును బోలదు పొందనటంచుఁ బూన్కిమైఁ
బలికితి నాదెభారము వివాహమునం దని చేసితిం బ్రతి
జ్ఞలు పలుభంగులన్ దెలియఁజాలకపోయితి విష్ణుమాయలన్. ౫

ఉ. నే నొనరించువాఁడ నొకనిం బరు సాయ మొనర్పనుంచు నె
వ్వైనను వేఁడఁబోవ ననునట్టియహంకృతి వేనికుండు న
వ్వానికి వక్త్రభంగము సభాస్థలిఁ గల్గఁగఁజేయుఁ గర్మమై
తానె చెలంగు దైవమని తప్పక నాయనుభూతి తెల్పెడున్. ౬

మ. పరమాత్ముం డిటు పంతమూనకుము నాపల్కుల్ మదిం జొన్ప మం
చు రహిం దెల్పఁగ వానిఁ జేకొనక కించుం బోలుచున్ గర్వినై
హరిభక్తవ్రజమందుఁ బూజ్యుఁడను నే నంచున్ మహాహంకృతిం
జరియింపన్ దగునే ఫలించె నదె యీచందాన దుఃఖాత్మతన్. ౭

మ. ఇఁకఁ జింతించిన నేఫలం బమరు నోన్నే రీతులం జూడ వె
న్కకుఁ బోఁ జెల్లదటంచుఁ దోఁచెడి మదిన్ | నాదౌ తపం బెల్ల దీ
నికిగా నొడ్డి హిమాచలేంద్రసుత, యానీరేజపత్రాక్షుఁ ద
ప్పక కోరంగ నొనర్చెదన్ జగతి నాపంతంబు నెగ్గించెదన్. ౮

చ. త్వరపడి యెట్టికార్యమును | బంతముమీఱ నొనర్పఁబూనరా
దరయక పూననే మరల | నయ్యది మిక్కిలి కష్టదం బటం
చొరులు హసింప మాను టది | యొప్పదు కష్టము లెన్ని వచ్చినన్
బురుషుఁడు తా సహించి మదిఁ | బూనినకార్యము నిర్వహింపనౌ. ౯

ఉ. దైవమె కార్యభారమును | దప్పక తీర్చును బౌరుషంబు లె
న్నే వితథంబులౌట నరు | లెప్పనిఁ దప్పక తీర్తుమంచు నే
యేవిధిఁ బూనరా దనుచు | హీనమతుల్ తెగి పల్కుచుంద్రు గా
దైవమునమ్మి పౌరుషముఁ | దప్పినవాఁడె ధరిత్రి నల్పుఁడౌ. ౧౦

ఉ. పౌరుషమే ఫలప్రదము | భావుకదానచణంబు గాన నే
పూరుషుఁడైన దైవమును | బుద్ధిఁ దలంపక యుండఁజెల్లు నం
చూరక ప్రేలుచుంద్రు ధర | నుద్ధతు లయ్యది యొప్పుగాదు గా
పౌరుషదైవముల్ కలియఁ | బండును గార్యము లేనిచోఁ జెడున్. ౧౧

చ. కనుకనె నేను దైవమును | గాదన కిట్టిప్రయత్నముం దపం
బునకు ఫలంబుగా దివిజపుంజము మేలనఁ జేయఁ బూనితిన్
వనజదళాక్షుఁ డిద్ది ఫలవంతముగా నొనరించుఁగాక నా
పని కొనసాగఁ బోయెదను | భారము శ్రీహరి దన్న నమ్మికన్. ౧౨

శా. కార్యం బిద్ది ఫలింపదేని భగవత్కల్యాణవిఘ్నంబు మ
న్మర్యాదాక్షతియుం బొసంగుఁ గనుకన్ | మానంబు గాపాడ నా
యార్యాచిత్తము మార్పునొందునటులే | యత్నింతు నిద్దానికిన్
వర్యాత్మీయ తపోమహాధనమునే | వర్జింతుఁ జక్ర్యర్థమై. ౧౩

మ. ధనవత్సంతతి నుత్తమోత్తములు గోత్రం దాపసుల్ వారిపెన్
ధన మత్యుత్తమ మద్ది సుంతతఱుగన్ | దానన్ మహాకార్యముల్
పునరుజ్జీవితముల్ మహార్థములునై | పొల్పారుచుండుం గదా
వనజాక్షార్థము నే వ్యయింతు ధనమున్ | భాస్వత్తపోరూపమున్. ౧౪

మ. పరమేశుం డిసుమంతే తృప్తుఁడయినన్ | భద్రంబు లెన్నే నిరం
తరముం గల్గుటె కాక తద్విమలపాదద్వంద్వదాస్యం బొగిన్
దొరకుం; గోరఁగ నర్హమైన దదెగా | తూర్ణంబుగా నాపరా
త్పరు దర్శింపఁగఁబోయెదన్ జని ఫలింపం జేసెదం బూన్కిమై. ౧౫

—౦ నారదునకు మునివేషమున శంకరుఁడు దర్శనమిచ్చుట. ౦—

మ. అని చింతించుచు నాలుగడ్గు లిడఁగా । నాచోట సర్వర్తుపు
ష్పనికాయోజ్జ్వలమై మహాఫలయుతిన్ । భాసిల్లి చూడంగ నిం
తని వర్ణింపఁ దరంబుగాని ప్రమదం । బందించు పత్త్రిధ్వనుల్
తనరం బొల్చు తపోవనం బొకఁడు వింతల్ గూర్చుచున్ గన్పడెన్. ౧౬

చ. కనఁబడినంతనే ఘునినికాయ్య మిదౌ నని యెంచి దేవతా
మునియు నిదేల తప్పితినొ । మున్ బలుతేపలు పోవుత్రోవ నీ
వన మిపుడే కనంబడినభంగి మనంబునఁ దోఁచెఁ జింతలే
మనమును గ్రమ్మియుండుటను । మార్గముఁ దప్పితి నంచు నెన్న నౌ. ౧౭

శా. ఆరామం బిదియంచుఁ దోఁచెడి నహా । హారిద్రుమాకీర్ణ మి
ట్లేరాజ్యంబుననుంట గానఁబడ దింకేలా వృథాలస్య మీ
యారామంబున నున్న పుణ్యమతులన్ । హర్షాబ్ధినిర్మగ్నులన్
శ్రీరామాప్రియపాదపద్మరతులన్ । సేవించెదన్ భక్తితోన్. ౧౮

ఉ. రాఁగల శ్రేయముం దెలుపు । రమ్యనిమిత్తము లంచుఁ బెద్దలే
బాగుగఁ దెల్పి రేనిపుడు । పట్టినకార్యము పండునంచు నే
న్నేగతులన్ మనోజ్ఞమగు । నీవనదర్శనజాత మోదమే
యూఁగు మదాత్మ నక్కటికనూని మఱింతగ నూఱడించెడున్. ౧౯

క. ఆకస్మికమగు ప్రమదం,బే కార్యము పండునంచు । నెఱిఁగించెడు నా
కీకడఁ గావునఁ ద్వరపడి, యీకమ్రవనంబుఁ జొత్తుఁ । గృష్ణుఁ దలఁచుచున్.

చ. అని తలపోయుచుం జనియె । నవ్వనసీమకు నందు నొక్కచో
మునితనయుల్ [1]పదింబదిగ । ముద్దులుగుల్క విపంచికారవం
బున గళనాదముంగలిపి । భూతవిభుం బరమేశు సత్కృపాం
బునిధి నమేయగేయములఁ । బోల నుతించుచు నుండి రెంతయున్. ౨౦

మ. ఒకచో భూజలతాగ్రభాగములపై । నొయ్యారముల్ మీఱఁగా
శుకముల్ చేడియ లింపుమీఱఁ బలుకన్ । శ్రోత్రైకపేయమ్ముగా
సకలాంగంబులు తృప్తినొంద వినుచున్ । సర్వేశు శ్రీశంభు ది
వ్యకపర్దోజ్జ్వలశీర్షునిం దలఁచుచున్ । భాసిల్లుచుండెం గడున్. ౨౨

చ. హరిహరు లంబుజాసనుఁడు । నాదిమతత్త్వమునుండి కల్గి రొ
క్కరుపుఁడునే స్వతంత్రుఁడనఁ । గాఁ జెలువారుదు నంచుఁబల్కువాఁ
డరసిన నిందు లేఁడనుచు । నాత్మల నమ్ముఁడు మీర లంచు నె
ల్లరకు మృదూక్తులం దెలుపుకైలాగునఁ గూయుచునుండెఁ [2]దిత్తిరుల్. ౨౩

1 పదింబదిగ = చక్కఁగా. 2 తిత్తిరి = తీతువపిట్ట.

స్త్రనియతిమీఱఁ గాత్మల నొసంగెడుభక్తిని గొల్వ సత్కృపం
గనుచుఁ దదీప్సితంబుల నిరామ మొసంగుచు నుండి రాగిరిన్. ౬౬౦

తే. సర్వగతులయ్యుఁ గైలాసశైల మెక్కి
కొందఱకు ధ్యానయోగంబుఁ గొందఱకు ముఖ్య
మాట నందుండి రట్టియాఖ్యలను దాల్చి
రెందు నెవ్వారుఁ దలఁచిన నందెయుండ్రు. ౬౬౧

క. ఎదికనఁబడినన్ భక్తుం, డది తద్రూపంబె యనుచు నాత్మ సతతమె
న్నఁ దగున్ గావున నట్టిం,ద్ర దయం గాపాడుచున్ వి రాజిల్లి రొగిన్. ౬౬౨

క. ఎందెం దేయేభక్తుఁడు, సందేహముమాని శాస్త్రసరణిఁ బ్రియమునన్
డెందమునఁ దలఁచు నట్లైక,నందగి వారొప్పి కమల నైజ విభవతన్. ౬౬౩

క. భంగ మనంగా నెఱుఁగని, మంగళముల నిచ్చు సర్వమంగళయని యు
ప్పొంగెడు ముదమున నుతియిం,పం గల్గిరి భక్తులు దముఁ బాలింపంగన్.

క. శివములఁ గోరినయట్టులె, భవహరములఁ బుణ్యకర్మఫలములను సదా
శివుఁ డొసఁగు భక్తిఁ గొల్చిన, సవిధిగ నని కొంద ఱెలమి సల్పిరి స్తుతులన్.

క. చరితం బీయది భద్రా,కర మగుటం జదువఁగ వినఁగ వివిధకాంక్షో
త్కరములు ఫలించు నంచని, సురమౌని చెలంగిపల్కెఁ జొక్కపుభక్తిన్.

క. మాయిర్వురయం దెవ్వరు, పాయని యేకత్వరూపభావము గనువా
రో యట్టివారిఁ గృతిసము, దాయమునం జేర్తు ననుచుఁ దమి హరి పల్కెన్.

క. ఏతనువునఁ దగువానిగ, నేతీరున నఖిలజగదధీశుని సమ్య
క్ప్రీతిని దలంచు నట్లే, యాతనికిం దోఁచి ప్రోచునని విధి పలికెన్. ౬౬౮

క. అందఱు తమ్మిటు నుతియిం,పందగి యవ్యాజకరుణ పైకొన సుమనో
బృందముల మేలె కోరుచు, నిందుధరుం డద్రిజయు గిరీంద్రంబందున్. ౬౬౯

క. అవినాభావంబగు బాం,ధవ మొప్పఁ బరస్పరసుకృతఫలాయిత సం
భవతం బొల్చుచు దంపతు, లవిరతశర్మముల నుండి రమరులు గొల్వన్. ౬౭౦

క. పరదేవీ పరమేశ్వర, చరితం బిది దివ్యయోగసారము సుజనో
త్కరపాత్ర్యం బిష్టార్థద, మరివర్గనికృంతనంబు నగు సతతంబున్. ౬౭౧

ఆశ్వాసాంత్యము.

క. ద్వైధీభావనికృంతన, వేధఃప్రముఖప్రజేశ వితతికృతనుతా
సాధిత దుష్టమహాసుర, యోధా కరుణామహాపయోధీ గిరిశా. ౬౭౨

శా. నారాచాయిత భార్గవీశ, సకలామ్నాయస్తుత ప్రాభవా
ఘోరాకారమహాసుర త్రితయసంగుప్తోరు పూర్భంజన

స్ఫారోదగ్ర కృశానునేత్ర విలసద్భాలా శివాఖ్యాస్మృతి
ప్రారంభ ప్రపలాయితాఘునికరా హారాయితాహీశ్వరా. ౨౭౩

మంగళమహాశ్రీవృత్తము:—

వారిధరవాహముఖ వర్ణిత మనోజ్ఞతమ భాసుర యశోగకువలయాప్తా
సారకరుణామృత రసస్నపనమోహయుత సాధుజనచిత్తవికచాబ్జా
భూరిసురవైరి కృతభూత వితతార్తిహృతి పూతగురు శౌర్యధనరాశీ
చారుతరశీలమణి సారవర హారగణ సన్నుతతనూ సురమహీజా. ౨౭౪

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీ కరుణావాప్త గీర్వాణాంధ్రకవితాప్రాభవ, కాశ్యపాన్వయప్రభవ, శ్రీజనమంచి వంశాంబురాశికుముదినీమిత్ర, సుబ్రహ్మణ్య మనీషిపుత్త్ర, తాండవకృష్ణాపరాభిధేయ, శేషాద్రినామధేయ వినిర్మితంబైన శ్రీ సర్వమంగళాపరిణయంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము సంపూర్ణము.

క. గిరిశరవసుశశిశకవత్సరయుత యువవర్షమందు శ్రావణమాసో
త్తరపక్షాష్టమియం దిది, పరిపూర్ణంబయ్యె దేవి పరమకరుణచేన్.

శ్రీ సర్వమంగళాపరిణయము సర్వము సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.



చెన్నపురి: శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము.—1935.—1000.